మానవసేవాగ్రంథమాల 22

# ఆర్యసూక్తిముక్తావళి

ప్రథమ భాగము

(భారతము)

ఇది

సత్యవోలు అప్పారావుచే

మానవసేవాపత్రికయందు

ప్రకటింపఁబడియె

---

రాజమహేంద్రవరము.

శ్రీ సరస్వతీనిలయ ముద్రాక్షరశాలయందు

ముద్రితము.

1913

వెల 4 అణాలు.

# ఆర్యసూక్తిముక్తావళి

ప్రథమ భాగము

(భారతము)

ఇది

సత్యవోలు అప్పారావుచే

మానవసేవాపత్రికయందు

ప్రకటింపఁబడినది

---

రాజమహేంద్రవరము.

శ్రీవిద్యానిలయ ముద్రాక్షరశాలయందు

ముద్రితము.

వెల 4 అణాలు.

# విజ్ఞాపన

సంస్కృతభాషయందును నాంగ్లేయభాషయందును బూర్వమహాకవివిరచితము లైనకావ్యములనుండి నీతిని ధర్మమును బ్రబోధించుపద్యముల నెత్తి ప్రత్యేకగ్రంథముగఁ బ్రకటించి లోకమునఁ బ్రకాశింపఁ జేయునాచారము కలదు. మన యాంధ్రభాష కట్టి భాగ్యము లభించినది కాదు. ఈకొఱఁత నివారింపఁ బూని కొందఱు భారతమునుండి మాత్రమే కొన్నిపద్దెముల నెత్తి ప్రకటించిరి. ఆంగ్లభాషలో ధర్మము లను తరఁగలు తాండవమాడు మహాప్రవాహమునకై కవిత్వముఁ జెప్పి విద్యార్థిహృదయకమలముల వికసింపఁజేసి కీర్తిఁ గాంచినకవిభాస్కరు లెందఱో కలరు. అట్టివారిగ్రంథములనుండి నీతివాక్యముల నెత్తి వేఱుగ్రంథముగఁ బ్రకటింప వలయు ననుతలంపు గలుగుటచే నే నిక్కార్యమునకు దొడఁగి "ఆర్యసూక్తిముక్తావళి" యనునామ మిడి మునుముందు కావ్యరాజ మని ప్రసిద్ధిఁ గాంచిన భారతములోని నీతిపద్యములఁ బ్రకటించితిని. మఱియుఁ దెనుఁగునఁ గలపురాణములనుండియు మహాకావ్యములనుండియు నీతిపద్యము లీగ్రంథమునందుఁ బ్రకటింపఁబడును. భారతములోనిపద్దెములు పూర్తి జేసి యీగ్రంథమును బ్రథమసంపుటముగఁ బ్రచురించితిని. ఇఁకముందు రాఁబోవు మామానససేవాసంపుటములలో భాగవతము రామాయణము మున్నగు నాంధ్రగ్రంథములనుండి నీతివాక్యములు ప్రకటింపఁబడును. కావున నెల్లరు నిట్టిగ్రంథములఁ జదువవలయు ననియుఁ దెనుఁగుగ్రంథములలోఁ గల నీతుల వెలయింపఁ జేయు నిట్టిగ్రంథములే దేశాభివృద్ధికరము లని తెలిసికొని యాదరింప వలయు ననియు, లోకజ్ఞానము గలిగి దయాసత్యశౌచములతోఁ దులతూఁగుచు దేశమును వెలయింపఁ జేయుట మానవస్వభావము కావున నట్టి స్వభావనిరూపణము సేయుచుండు నిట్టిగ్రంథములు ఉపయుక్తము లని తెలిసికొని యెల్లరు నాదరింపవలయు ననియు గోరుచున్నాఁడను.

ఇట్లు

రాజమహేంద్రవరము.
29—3—1913

విజ్ఞాపనసేయువాఁడు
సత్యవోలు అప్పారావు.

# ఆర్యసూక్తిముక్తావళి.



తే. తగినవేషంబు, తనుదాన పొగడుకొనమి,
నొచ్చియును గీడు వలుకమి, యిచ్చి వగవ
కునికి, దన కెంత నడవకయున్నఁ బథముఁ
దప్పకుండుట నడవడి కొప్పు సేయు. 1

క. అరిగిన నలుగక యొగ్గులు
వలికిన మఱి వినని యట్ల ప్రతివచనంబుల్
పలుకక జన్న ముఖడి యెదఁ
దలఁపకయున్నతఁడు సూవె ధర్మజ్ఞుఁ డిలన్ 2

తే. కొంచెమైనను దగఁ బంచి కుడువ మేలు,
పనులయెడ దుఃఖ మోర్చి యల్పంబు సుఖము
ననుభవించుట హితము, శత్రునకునైన
నిచ్చుటయ యెన్న యడిగినయెడ నృపాల! 3

క. శారీరమానసమహా
దారుణదుఃఖములఁజేసి తపిఁగి శరీరుల్
క్రూరతరబాధ బొందుదు
రారెంటినిఁ గెలుతు రార్యు లమలినబుద్ధిన్ 4

తే. చెల్లియుండియు సైరణ సేయునతఁడు,
పేదవడియును నర్థికి బ్రియముతోడఁ
దనకుఁ గలభంగి నిచ్చునతండుఁ బుణ్య
పురుషు లని చెప్పి రార్యులు గురువరేణ్యా! 5

క. జనులకు నొడఁబాటగు విధ
మున నడచుచు, లోకనింద్యముల కుడుగుచు, మీ
రినయెుని కలిమి కులుకక
మనుజులలోఁ బొందిపొసఁగి మను టొప్పు నృపా! 6

ఆ. విను మహింస ధర్మవితతి కెల్లను మేటి
యదియు సత్యయుక్తమైన వెలయు

నాఘ ! శిష్టచరితలందు సత్యము కడు
నధిక మనిరి శ్రుతుల నరసి బుధులు. 7

క. పురుషుండు రెండుతెఱఁగుల
ధరఁ బాత్రుఁ డనఁగఁ బరఁగు దా నెయ్యెడలం
బరుసములు పలుకకునికిన్
దురితంబులు వొరయు పనులు దొరఁగుటవలనన్. 8

ఉ. ధర్మము పల్కుచుం దగిలి ధర్మపథంబునఁ జేసి యర్థమున్
జేర్చియుఁ గాంచి ధర్మవిధిఁ జెందియునై ప్రజలన్ సృజించి స
త్కార్యములు ప్రశస్తములుగాఁ గ్రతువుల్ ప్రొనరించు సజ్జనుల్
ధర్మజ ! యిందు నందును ముదంబునఁ గాంతు రభీష్టసంపదల్. 9

క. తను లోకము గొనియాడఁగ
విని యుబ్బఁడు సజ్జనుండు ; వెండియుఁ గడు మే
లొనరించు ; నీ డొకించుక
యును దన దెసఁ దోఁపనీక యొసఁగుచు వచ్చున్ 10

సీ. దానంబు సత్యంబుఁ దపము యజ్ఞము వార్జవముఁ గామలోభాదివర్జనంబు
గురుజనశుశ్రూష క్రోధరాహిత్యంబు దమము సంతోష మధ్యయనరతి
దాంభికత్వము లేమి దైన్యంబు వొరయమి యనసూయ యనహంక్రియాభియుక్తి
దలపంగ వాద్యమై తనరు ధర్మము సెప్పు గొనియుంట వాస్తికగోష్ఠి జనమి

గీ. శీలసంపత్తి తీర్థసంసేవ శౌచ
మఖిలభూతములందు దయార్ద్రిఁ దగుట
మితహితోక్తులు సంశ్రితమిత్రగుప్తి
యున్నియును శిష్టచరితంబు లర్థచరిత ! 11

శా. ఆలస్యం బొకయింత లేదు, శుచి యాహారంబు, నిత్యక్రియా
జాలం బేమర, మర్చనీయు లతిథుల్, సత్యంబ పల్కుంబడున్,
మైత్రి శాంతియు బ్రహ్మచర్యమును నెమ్మిందాల్తు మర్త్యాట నె
క్కాలంబుం బటుమృత్యురోగభయశంకం బొంద మే మిమ్ములన్ 12

చ. ఎడపక వాఙ్మనఃక్రియల నెవ్వరికిన్ హింస యొనర్పఁ బోక, రె
1 య్యెడలను డంబలం గిరుల యేర్పడఁ బోకవ చూతు, రిచ్చుచో
గడమపడంగనీ రెడిరి కాంక్షితముల్ తుదముట్టఁ దీర్తు, రె
వ్వఁడు మదిఁ గూర్తు రాశ్రితులను నిను మిన్నియు నార్యధర్మముల్. 13

భారతము.

# ఆర్యసూక్తిముక్తావళి.



తే. తగినవేషంబు, తనుదాన పొగడుకొనమి,
నొచ్చియును గీడు పలుకమి, యిచ్చి పగవ
కునికి, దన కెంతె నడవకయున్నఁ బథముఁ
దప్పకుండుట నడవడి కొప్పుసేయు. 1

క. అరిగిన నలుఁగక యొగ్గులు
పలికిన మఱి వినియుట్ల ప్రతివచనంబుల్
పలుకక జన్నమువడి యెదఁ
దలఁపకయున్నతఁడు సూవె ధర్మజ్ఞుఁ డిలన్ 2

తే. కొంచెమైనను దగఁ బంచి కుడుచు మేలు,
పనులయెడ దుఃఖ మోర్చి యల్పంబు సుఖము
ననుభవించుట యోగ్యము, శత్రునకునైన
నిచ్చుటయ యెన్న యడిగినయెడ నృపాల! 3

క. శారీరమానసమహా
దారుణదుఃఖములఁ జేసి తపిఁగి శరీరుల్
క్రూరతరబాధ బొందుదు
రారెంటినిఁ గెలుతు రార్యు లమలినబుద్ధిన్ 4

తే. చెల్లియుండియు నిగ్రహ సేయునతఁడు,
బీదపడియును నర్థికి బ్రియముతోడఁ
దనకుఁ గలభంగి నిచ్చునతండుఁ బుణ్య
పురుషు లని చెప్పి రార్యులు గురువరేణ్యా! 5

క. జనులకు నొడఁబాటగు విధ
మున నడచుచు, లోకనింద్యముల కుడుగుచు, మీ
రినయొరుని కలిమి కులుకక
మనుజులలోఁ బొంది పొసఁగి మను టొప్పు నృపా! 6

ఆ. విను మహింస ధర్మపతిత కెల్లను మేటి
యునికియు సత్యయుక్తమైన పలుకు

క॥ పరులధనమునకు విద్యా, పరిణతికిం దేజమునకు బలమునకు మానం
బెరియంగ నసహ్యపడు న, న్నరుఁడు తెవులులేని వేదనంబడు నధిపా 24

క॥ ఎదిరికి హితమును బ్రియమును, మదికింపును గాఁగఁ బలుకుమాటలు శైక్ష్య
మొదవినను లెస్స; యటుగా, కిది యది యన మూఁగకునికి యంతయునొప్పన్ 26

క॥ చెలిమియుఁ బగయును దెలివియుఁ, గలఁకయు ధర్మంబుఁ గోపగతియును బెంపుం
దలుకతనంబున వచ్చును, బలుకుబడిన, కానఁ బొసఁగఁ బలుకఁగవలయున్ 29

క॥ తనువున విరిగిన యలుగుల, ననువునఁ బుచ్చంగవచ్చు; నతినిష్ఠురతన్
మనమున నాటినమాటలు, విను మెన్నియుపాయములను వెడలునె యధిపా 27

తే॥ నియతతపమును నింద్రియనిగ్రహంబు, భూతదయయు శాంతికిఁ గారణములు
వానియన్నింటికిం బై మేలైన శాంతి, కారణము లోభమునుఁగట్టి కామనేంద్ర 28

క। కారణములేకయును నృప, కార్యపరత్వమున నొరులు కార్యంబులకున్
వారనియలజడి బడియెదు, వారలువా రేమగడియ వసుధను నధిపా 29

సీ॥ సత్యహితాలాపచతురత యర్థంబు; సంతత సుజనపూజనము వలయు;
ఘను క్రోధసంగంబు విద్వేషములఁ జేసి మతిగలంగినను ధర్మంబుఁ దప్ప
కుండంగ నడచు టుత్కృష్టమాసరణి; యప్రియములయందును బ్రియములందు
దైన్య హర్షంబులఁ దగులక యున్నట్టి కళ్యాణవర్తనకాంతు లెస్స;
యొగ్గుచేసినవారికి హితము సేత, యార్యజనములు కీర్తింతు; రన్యదోష
కారి తనదోషమునఁ దాన కాలిపోవు, వేఱ వానికిఁగీడు గావింపనేల? 30

క॥ అది సర్వదోషముల కా, స్పద మది దురితక్రియానుబంధంబులకున్
మొదలు నిరంతరదుఃఖ, ప్రదమని మదిఁదలఁచి తృష్ణ మాను సుమతుల్ 31

క॥ మదిమఱపున బాపము లేన, కొదవుటయును విడచ వచ్చి యొకనన్నమును నే
నిది సేయ నిఁక ననియెడు మది జెలసగమును నరుండు పలఁపు నఘంబుల్ 32

ఆ॥ ఓడుపు వలయు సకలవిషయవాంఛలయందు, నదిపుబోలుగాను వెదకి చూండు
గానకొంకి బుధులు; కలదె పరిత్యాగ, శీలునకు నసాధ్యసిద్ధి యొందు? 33

తే. వార్తయందు జగము వర్తిల్లుచున్నది, అదియు లేని నాఁడ యఖిలజగము
నంధకారమగ్న మగు నట్లు గావున, వార్త నిర్వహింపవలయుఁ బతికి 45

తే. కార్యగతుల తెఱఁగుఁ గలరూపు చెప్పిన, నధికమతులు దాని నాదరింతు
రల్పభాగ్యబుద్ధు లగువారలకు నది, విరసకారణంబు విషము వోలె 46

క. ధర్మజ్ఞులైన పురుషులు ధర్మమునకు బాధసేయు ధర్మువు నెందుఁ
ధర్మముగా మది దలపరు, ధర్మువు సర్వంబునకు హితంబుగ వలయున్ 47

క. తగు నిది తగ దిది యెడలో, వగవక సాధులకుఁ బీడవారల కెగ్గుల్
మొగిఁ జేయు దుర్వినీతుల, కగు ననిమిత్తాగమంబు లయిన భయంబుల్ 48

క. నరనాథుఁ గొలిచి యలవడ, దిరిగితి నాకేమి యనుచుఁ దేఁకువలేమిన్
మరియాదఁ దప్ప మెలఁగిన, బురుషార్థంబునకు హాని పుట్టకయున్నే? 49

క. పలుమరు శపథంబులు, నం, జలులును, నభివాదనములు, సానుప్రియభా
షలుమిథ్యావచనంబులు, గలయవి దుష్టస్వభావ కాపురుషులకున్ 50

ఆ. కారణంబు లేక దారుణంబుగ సాధు, హింస సేయు కుజనుఁ డెల్ల వారి
కప్రియుండ కాక యప్రియులకుఁ గాం, బొందు కలదె తలఁప నుత్తములకు 51

క. నెమ్మి గలవారి నెల్లరు, తె మ్మొల్లనివారి వెనుకఁ దగులుదు రధిక
త్వ మ్మెఱిఁగి యెఱిఁగి తోడరుము, రి మ్మెలుఁగనియట్టివారి కిభపురనాథా 52

క. రోషము శోకము, రాగ, ద్వేషము లభిమాన దర్పవేగాలస్యా
శ్లేషము లజ్ఞాన మని మ, నీషిజనము సెప్పు మాననీయచరిత్రా! 53

ఆ. సకలపుణ్యకర్మచయమును నొకదెస, వినుము పాడిదప్పకునికి నొక్క-
వలను దీని శ్రుతులు దెలిపెడునెడఁ బాడి, కలిమియందు నెక్కు గాని పింపె 54

చ. అరయఁగ రాజధర్మము సమాశ్రయమై నడపుం ద్రివర్గమున్
గురుతరమోక్షధర్మమునకుం దలపం దనప్రాప యూఁత; భూ
వర! విను ఘోటకంబునకు వాగెయు, దంతికి నంకుశంబు నే
కరణి నివారకంబులు జగంబుల కట్టుల తాను నెమ్మెయిన్ 55

తే. మిత్రసంపన్నుఁడైన సమిత్రమిత్రు । బలముతోడను భేదించు బలముఁ జలముఁ
గలిగి దేశబలంబును గాలబలము । గలుగువాని కసాధ్యంబు గలదె యెందు 56

క. సత్యంబు బ్రహ్మచర్యము । నిత్యశుచిత్వ మౌన మతులనియమము దయ శు
ద్ధత్యాగంబుఁ దపస్సం । పత్యాకృతు లండ్రు బుధులు పౌరషముఖ్యా 57

క. మృదుభాషణముల దుర్జన । హృదయములు ప్రసన్నతామహిమఁ బొందునె? యొ
ల్లిదముగఁ గొని యంతంతకు । మద మెక్కుం గాక దురభిమానము పేర్మిన్ 58

తే. గర్వియై కార్య మిట్టి దకార్య మిట్టి । దని యెఱుంగక లోకంబు చనుపథమునఁ
దిరుగ కున్మదవృత్తి వర్తించునట్టి । వాని గురునైన దండింపవలయు నండ్రు 59

చ. నుతజలపూరితంబు లగునూతులు నూఱిటికంటె నూన్నృత
వ్రత యొకబావి మేలు, మఱి బావులు నూఱిటికంటె నొక్కస
త్క్రతు వది మేలు, తత్క్రతుశతంబులకంటె సుతుండు మేలు, త
త్సుతశతకంబుకంటె నొక సూనృతవాక్యము మేలు చూడఁగన్ 60

చ. ధనపతితోఁ దరిద్రునకుఁ, దత్త్వవిదుం డగువానితోడ మూ
ర్ఖునకుఁ, బ్రశాంతుతోడఁ గడుఁ గ్రూరునకున్, రణశూరుతోడ భీ
రునకు, వరూధితోడ నవరూధికి, సజ్జనుతోడఁ గష్టదు
ర్జనునకు, నెవ్విధంబునను సఖ్యము దా నొడఁగూడ నేర్చునే? 61

చ. కరితురగాదిఘుష్టనయు గాలియు నొంపదె యొంటియున్న య
త్తరువు ననేకభూమిరుహవితానము గుం పయి యున్న బాధలం
బొరయునె? యన్నదమ్ములును బొందిన నేరి కసాధ్యు, లట్లు గా
కిరవయి నిల్చినం గెలని కిల్లిదమై పఱివోదు రంతయున్ 62

తే. బలముఁ గలవానిఁ బలువురు బలవిహీను । లొక్కటై కూడి నిర్జింతు రుత్సహించి,
మధుపుఁ గొన నుత్సహించిన మనుజు బట్టి । కుట్టి నిర్జించు మధుకరకులము నట్లు 63

క. అలఘుబలశక్తియోధా । స్తుల కైనను బలము లేక దోర్గర్వము మై
గలుగునె నశమె సహాయుల । కలిమి ననంతరంబు లగుపగాసైన్యములన్. 64

ఉ. మాయలు గల్గుదుష్టులకు మాయ ప్రభంగులె మందు గాక, ని
ర్మాయత నుల్లసిల్లెడు పరాక్రమశీలురు గల్గు నెట్లు? దై
తేయులు తొల్లి మాయల నతిప్రబలాత్ములు లైనఁ దద్వధో
పాయములం జయింపరె నృపాలక! విష్ణుఁడు నిందుఁడుం దగన్. 65

ఆ. వె. పగయు కలిగెనేనిఁ బాము న్నయింటిలో । నున్నయట్ల కాక యూరడిల్లి
యుండు నెట్లు చిత్తమొకమాటుఁ గావున । వలన దధికదీర్ఘవైరవృత్తి. 66

క. బాలుఁ డనితలఁచి రిపుతో । నేలిదమునఁ గలసి యునికి యిది కార్యమె యు
ద్వేలానలకణ మించుక । సాలదె కాల్పంగ నుగ్రశైలాటవులన్. 67

క. మనుజులకు నెవ్వనంబున । ననతిక్రమణీయమైన యాపద్విషయం
బున సంతాపింపంగాఁ । జన దని యెఱిఁగియును దగునె సంతాపింపన్. 68

క. ధృతి యారోగ్యము నొసఁగును । ధృతి యుజ్జ్వలలక్ష్మిఁ దెచ్చు, ధృతి కీర్తిసము
న్నతిఁ జేయుఁ గాలగత్యను । గతి గలిగినఁ గలుగు ధృతి వికారవిదూరా. 69

క. కడునధికుతోడఁ దొడరినఁ । బొడిచిన నొడిచినను బురుషు పురుషగుణం బే
ర్పడుఁ గాక హీను నొడుచుట । కడిఁదియె పౌరుషము దానఁ గలుగునె చెప్పుమా? 70

క. బలహీనులైనవారలు । బలవంతుల నొడుచునప్పుడు బహుళగమాయా
బలములఁ జేయుట యెందును । గలయదె, యాజయముకాదె కర్తవ్య మిలన్. 71

క. విను పురుషుఁడు గావింపని । పనులకు దైవ మది యెట్లు ఫల మొసఁగించున్
జనములు కార్యము నడుపఁగ । ననుకూలత నిచ్చుఁ గాక యదియె ఫలముల్. 72

తే. పౌరుషమ్ము దైర్ఘ్యంబు తోడ్పాటు లేక । ఫలముఁ బొందంగ నేరదు పార్థివేంద్ర!
విత్తు సహకారి గాకున్న రిత్తనేల । వంధ్య మగుగాక, తా ఫలవంత మగునె 73

తే. మేలు రెండులోకంబుల మేలు తెచ్చు । గీడు సేయఁ బదంపడి కీడ యగును
గాన పురుషవర్తనమున కానుకూల్య । శీల మగు దైవ మది ఫలసిద్ధిఁ జేయు. 74

క. చెలిమియు సంభాషణమును । బలిమి వివాదంబుఁ దోపుఁబాడియు దమయం
తులవారితోన తగునవి । కులహీనులతోడ నెన్నఁ గొఱగా వధిపా. 75

క. ప్రజ్ఞయ ప్రతిష్ఠాలాభము । ప్రజ్ఞయ నాకం బసంగఁ బ్రజ్ఞయ మవ్వే
ప్రజ్ఞయ కైవల్యదమును। బ్రజ్ఞాసాధ్యములు కాని పనులుం గలవే. 76

క. గురుకొని కార్యాకార్యము । లెఱుఁగక దుశ్చరితుఁడై యహితుఁ డగునేనిన్
మఱవక గురు నైనను జను। లెఱుఁగఁగ శాసించునది మహీశుఁడు బుద్ధిన్ 77

క. ధీరమతియుతులతోడ వి । చారము సేయునది మును విచారితపూర్వ
ప్రారంభ మైనకార్యము। పారము వొందును విఘాతపదదూరంబై. 78

ఉ. ఇమ్ముగ నాత్మరక్ష విధియించువిధంబున మంత్రరక్ష య
త్నమ్మునఁ జేయఁగావలయుఁ దత్పరిరక్షణశక్తి నెల్లకా
ర్యమ్ములు సిద్ధిఁబొందుఁ బరమార్థము, మంత్రవిభేద మైనఁ గా
ర్యమ్ములు నిర్వహింపఁగ బృహస్పతి కైనను నేరఁ బోలునే 79

క. తన కపకారము సేసిన। జనుఁ డల్పుం డనుచు నమ్మి జడమతియై చే
కొనఁ జన దించుకము ల్లయి । నను బాదతలమున నున్న నడఁగ నగునే. 80

చ. తడయక సామభేదముల దానములన్ దయతోడ నమ్మఁగా
నోడిరియు సఖ్య మిచ్చియు జనున్ జననాథకృతాపరాధులం
గడఁగి వధింపఁగా ననుట కార్యముకం బిది గాన నెట్టులుం
గడుకొని శత్రులం జెఱుపఁగాంచుట కార్యము రాజనీతి మై. 81

క. మొనసి యపకారిఁ గనని సిఁ । కొనియుండెడుసుమతి దీర్ఘకుజశాగ్రం
బుననుండి నిద్రవోయెడు। మనుజునకు సమానుఁ డగుఁ బ్రమత్తత్వమునన్ 82

క. తన కిమ్మగునంతకు దు । ష్టనుఁ డిష్టుఁడపోలె నుండి సర్పముఁబోలెన్
దన కిమ్మగుడును గఱచును । ఘనదాయాదాగ్మగరళఘనదంష్ట్రిలచేఁ 83

ఆ. కీర్తిలేనివానికిని జీవనంబు ని । ర్ధకంబు నూనె యననిమీఁద
నిత్య మయినధనము నిర్మలకీర్తియ । యట్టికీర్తి నడయు టశ్రమంబె. 84

క. ఇలఁ గీర్తి యెంతకాలము। గలిగి ప్రకీర్తిల్లు నంతకాలంబును ని
త్యులు గారె గీర్తిగల పు । ణ్యులు, కీర్తిహీనుఁ డెంగనుం బూజ్యుండే. 85

క. ధీరమతియుక్తిఁ జేసి వి । చారింపఁగ నిక్కువంబు సర్వజనస్వ
ర్గారోహణసోపానం । బారఁగ ధర్మంబ చూవె యతిరమ్య మగున్. 86

ఉ. శత్రుల నాజి నోర్చుటయు, సర్వభయంబులఁ బొందకుండఁగా
ధాత్రిఁ బరిగ్రహించి యుచితస్థితిఁ గాచుటయుం, బ్రియంబుతోఁ
బాత్రుల కర్థ మీగియును, బ్రాహ్మణపూజయుఁ జన్నె యుత్తమ
క్షత్త్రియధర్మముల్ సుగతికారణముల్ విపులార్థమూలముల్. 87

చ. అరదము దేహ, మింద్రియము లశ్వము, లాత్మఁడు సూతుఁ, డిమ్మహా
తురగచయంబు ధైర్య మను తోరపుబగ్గములన్ దృఢంబుగా
నురవడిఁ బోకయుండ వెరవొప్పఁగఁ బట్టినవాఁడు స్వర్గపుం
దెరువున నేఁగు, నప్పరమ ధీరుఁడు సన్వె యుదారుఁ డెయ్యెడన్. 88

తే. ఇంద్రియంబులు దివిచినయెడకు బాఱుఁ। జూడు మనసెప్డుఁ దద్వేగ ముడుపకున్న
వెడలి చెడిపోవు బుద్ధి యుద్ధీర్ణపవన।హతిఁ బయోనిధిలోఁ గల మవియు నట్లు 89

మ. అసుఖాకారత నిద్ర దైన్యము విమోహం బక్షమత్వంబు దా
మసభావంబులు, రాగలోభజడతామానంబు లూహింప రా
జసవృత్తంబులు, ధైర్యశాంతికరుణాసంతోషవిద్యాదు లిం
పెసఁగన్ సాత్త్వికచేష్టితంబులు, నిజం బి ట్లాత్మ గ న్మిన్నియున్ 90

చ. అనఘుఁడు సాత్త్వికుం డగుమహాత్ముఁడు బోధనిరూఢిఁ దత్త్వముం
గనుఁగొని లోకవృత్తములు గా వని రోసి సమస్తసంగముం
గనిరతుఁడై తొఱంగు మమకారవికారమహంక్రియావ్యతిం
బమపక్షి సంయమప్రకటభావన నుత్తమశాంతిఁ గైకొనున్ 91

క. కామంబును గ్రోధంబును । నేమఱక జయింపవలయు నెల్లవిధములన్
ధీమహిత! యివియ సతత। క్షేమంకర మైనపథము కృతబుద్ధులకున్. 92

క. చేతనరహిత క్షేత్రముఁ । జేతనముం బొందఁ జేయుజీవాత్మ దగా
స్వీతుఁడు పరమాత్ముఁడు వి। ఖ్యాతుఁడు త్రైలోక్యసంప్రకల్పనుఁ డనఘా. 93

—భారతము—

మ. విలసద్ధర్మవిశుద్ధవృత్తులు భయోన్మద్ధుల్ కుశాగ్రీయబు
ద్ధులు మధ్యస్థులు కార్యనిర్ణయసమర్థుల్ మానమాత్సర్యదూ
రులు నాఁ జాలినవారిపల్కులకు నైరుధ్యంబు గావింపద
జ్ఞులు భూనాథుల కాప్తులున్ సఖులు నై శోభింతు రత్యంతమున్. 94

క. అరయఁగ విషయము లెంతయు, దురంతములు వానియందుఁ బొడరినఁ జేటుం
బొరయుదురు పొడఁకకున్నం, బరమపదవి యమ్మహానుభావులకు నగున్. 95

తే. వాఙ్మనఃకాయములు శౌచవంతములుగ, జేసికొని యనహంకారశీలశాంత
బుద్ధి రై నిరపేక్షతఁ బొంది యఖిల, భూతదయ గల్గి మెలఁగంగ బోధ మొందు 96

క. క్షమయును సత్యంబును శౌ, చమును సుధర్మములు బ్రహ్మచర్యం బత్యు
త్యుత్తమధర్మము వానికిఁ జి, త్తము నలవఱుపంగవలయు ధైర్యము పేర్మిన్. 97

ఆ. అర్థవంతుఁ డై భోగంబు లనుభవింప, చున్న యప్పుడ యిది యిట్టు లుండ నేర,
దస్థిరమ తాను లోనుగా ననియెఱుంగు, నతఁడు మగఁ బొందఁ డేవియెల్లైన నధిప. 98

క. ప్రాజ్ఞుఁడు గమించు నొక్కెడ, ప్రాజ్ఞుఁడు పెక్కండ్రఁ బ్రీతిఁ బరఁగఁగఁజేయున్
బ్రాజ్ఞుఁడు బలవంతుం డగుఁ, బ్రాజ్ఞుఁడు కలహమునఁ దొట్టుపడక తొలంగున్. 99

క. దోష మరసి కామంబును, రోషంబును లేక తగినరూపునఁ జేయం,
బోషక మగు ధర్మమునకు, వైషమ్యవిహీన మైనపథము కుమారా. 100

క. విమలజ్ఞానముఁ దపమును, దమమును ద్యాగంబు శాశ్వతప్రియదానం
దములకు మూలము లందురు ని, జముగాఁ గైకొందు రివియ ప్రసన్నవివేకుల్. 101

క. జ్ఞానంబు నాశ్రయించిన, వానికి నేపనులఁ గీడ్పు వాటిల్లదు ప్ర
జ్ఞానరహితుండు కామా, ధీనత మెయిఁ గర్మసమితిత్రిప్పలఁ జిక్కున్. 102

క. విను మచిరవృత్తిఁ జేసిన, పని కర్తకు నాపహించుఁ బశ్చాత్తాపం
బనఘా! చిరభావితబు, ద్ధినిరూపణకృతము శుభముఁ దేజముఁ దెచ్చున్. 103

క. కార్యవిచారము చిరముగ, ధైర్యముతో నడపవలయుఁ దత్తత్క్రియలం
దార్యుఁ డనార్యుఁడు వీఁ డని, యార్యులు సేయుదురు నిశ్చయంబు దిరముగన్ 104

క. మిత్రత్వము శత్రుత్వము, బాత్రతయు నపాత్రతయును బరికించు నుదా
రతుఁడు చిరతరగణనా, సూత్రితముగ దాన నెల్లశుభములు నొందున్. 105

చ. వినయము విద్యయుం గలుగువిప్రునియందును గోవునందు నొ
ప్పు నెఱయుహస్తియందు నొకపోకకుc బోనికుక్కయందు దా
ని నడిచి తెచ్చి వండి తినునీచపుమాలనియందుc దుల్యద
ర్శనులు ప్రశాంతరాత్ముని నిరంజనునిం గనునట్టిపండితుల్. 106

క. రాజునకు విజయమూలము, రాజితమంత్రంబు సుస్థిరంబుగ దానిన్
రాజాన్వయ! రక్షింతె ధ, రాజనులకుc గర్ణగోచరము గాకుండన్ 107

క. నానావిధరణవిజయము, వానిపుణులు లవార్యవీర్యు లవc దగువారిన్
సేనాధ్యక్షులc జేసితె, నీవవిశ్రాంతవారి మాననీయుల ప్రీతులన్. 108

క. చోరభయవర్జితముగా, ధారుణిc బాలింతె యధికధనలోభమునం
జోరుల రక్షింపరుగా, వారలచే ధనముc గొని భవద్భృత్యేశ్వరుల్. 109

క. ధరణీనాథ! భవద్భుజ, పరిపాలిత దైనజనమ్ముc బరిపూర్ణముగా
కర మొప్పుచున్నె చెలువులు, ధరణి కరాగ్రహభయంబు దనుకక యుండన్ 110

క. పంగుల మూకాంధుల వి, కలాంగుల మఱి బాంధవులు దయం బోత్రె భయా
ర్తుం గడcదిరత్రి సైనను, సంగరభంగమునc గాతె శరణం బనినన్. 111

క. కృత మెఱcగి కర్తనుత్తము, మతుల సభల సన్నుతించి మఱవక తగc స
త్కృతి సేయుదె కృత మెఱcగెదు, పతివై జగజ్జనుల నెల్లc బరిపాలింపన్. 112

క. పరకీయము బాహ్యార్థ్యం, తరజనములవలన సంతతము నిజరక్షా
పరుcడ వయి పరమఖీలుల, చరిత్రము వీక్షింతె నిపుణవరనేత్రములన్. 113

క. తెలియcగ విద్వజ్జనముల, ఖ్యాలతోడ నశేషధర్మకుశలుcడ వయి యు
ముఖ్యల లోకవ్యవహార, ముఖ్యలు దయc బరికింతె నిత్యమును సమబుద్ధిన్. 114

చ. బహుధనధాన్యసంగ్రహము బాణశరాసనయోధవీరసం
గ్రహము నిరంతరాంతరుదకంబులు ఘాసరసేంధనాఘసం
గ్రహము సనేకయంత్రములుc గల్గి యసాధ్యము లై ద్విషద్భయా
వహము లనంగ నొప్పునె భవత్పరిరక్ష్యము లైనదుర్గముల్. 115

చ. వదలక బుద్ధి నంతరరివర్గము నోర్చి జితేంద్రియుండ వై
మొదలను దేశకాలబలముల్ మఱి దైవబలంబుఁ గల్గి భూ
విదితబలుండ వై యహితవీరుల నోర్వఁగ నుత్సహింతె దు
ర్మదమలినాంధచిత్తులఁ బ్రమత్తుల నింద్రియనిర్జితాత్ములన్. 116

తే. క్షత్రనీతికిఁ గ్రమములుగావు సూవె, నికృతియును జూదమును ధర్మనిత్యు లైన
వారి కీరెండును వర్జింపవలయు నెందు, బాపమూలంబు జూదంబు పార్థివులకు. 117

ఆ. కుటిలమార్గు లయినకుత్సితకితవుల, తోడఁ గడఁగి జూద మాడఁ జనదు
దానఁ జేసి యర్థధర్మవినష్టిను, లగుదు రెట్టివారు జగములోన. 118

తే. తగిలి నిత్యంబు నేకాంతధర్మశీలుఁ, డగుట యుత్తమ పురుషున కట్టివాని
వెలయు నర్థకామంబులు విడువఁ జాలి, విగతసుఖదుఃఖములు రెండు విడుమనట్లు 119

క. అరివరుల నోర్చి సాగర, పరివృతభూచక్ర మెల్లఁ బాలింపు ప్రజా
పరిపాలనంబు కంటెను, ధరణీశ! విశేష మొండు ధర్మము గలదే. 120

చ. అలఘుగుణంబులం దధికుఁ డైనమహాత్ముఁడు రాగకోపమా
యలఁ బడి యక్షమావివశుఁ డై యచిరాంశులతావిలాసచం
చల మగులక్ష్మి కాసపడి సత్యము ధర్మముఁ దప్పి సత్సభా
వలిఁ దగువారియొద్దఁ దగువాఁడయి సన్నిధి నుండ నేర్చునే. 121

క. వగవంగ సాంగోపాంగము, లగు నాలుగువేదములయు నధ్యయనము పా
ల్పొగ నొక సత్యముతో నెన, యగునే యొవ్వేతయును బోలవఁట సత్యంబున్. 122

తే. జనులు నిగ్రహానుగ్రహశక్తుఁ డైన, రాజశాసనమునఁ జేసి రమణతోడ
నోలిఁ దమతమమర్యాద లొక్కఁడైనఁ, దప్ప నోడుదు రిమ్మహీతలము నందు. 123

క. కడుకొని కడుముఖులు లై, నెడ నుచితమె యాత్మనింద యొరుయోగ్యుల ఘనం
బడలక యేకాకృతి నె, వ్వడు నుండుట నూనె పురుషాపురుషార్థ మిలన్ 124

క. ఈలోకము యగుఁ గొంచఱు, కాలోకము కొంచఱు నిహంబును బరమున్
నేలగు గొంచఱ కధిపా, యేలోకము లేదు వినవె యిలఁ గొంచఱుకున్. 125

చ. ధనములు సాలఁ గల్గి సతతంబును నింద్రియపాంథ సల్పుచున్
మనమున నెవ్వఁడున్ సుకృతమార్గము పొందఁడు లోక లోభమో
హనిరతబుద్ధు లై తిరుగునట్టిజనుల్ పరలోకసౌఖ్యముల్
గనుటకు నేర రిప్పటిసుఖంబులు మే లయి తోఁచు వారికిన్. 126

క. అరులు మిగులఁ గొని రాజులు, నరులకు నెంతయును భయ మొనర్తురు ధరణీ
సురులు గడఁగి వాణిజ్యముఁ, గరిసనమును జేయఁ గలరు కలికాలమునన్. 127

సీ. సస్యంబు నరులకు సంక్షీణ మగు, సస్యహాని నాయువు గడు నఱిగి పోవు
నాయువు దఱిఁగిన నల్పంబు లగు విద్యఁ లల్పవిద్యుల విమోహంబు మిగులు
మోహంబువలనఁ బై మునురు లోభంబు, లోభావేశమునఁ గామ మగ్గలించుఁ
గామంబు పెంపునఁ గడఁగుఁ గ్రోధంబు, క్రోధంబున వైర మెంతయును బెరుఁగు
వైరమున నశేషవర్ణులు నన్యోన్య, పీడ సేయుదురు విభిన్నబుద్ధి
నొక్కఁ డొకని మేర నుండక వర్ణసం, కరము సేయఁ గలరు కలియుగమున. 128

క. జపనియమస్వాధ్యాయ, ప్రపంచములు విడువఁ గలరు బ్రాహ్మణులు జనా
ధిప! శూద్రులు విపులతపః, క్షపితులు గాఁ గలరు వినవె కలికాలమునన్. 129

క. రసగంధద్రవ్యంబులు, పస చెడు సస్యంబు లల్పఫలము లగు మహిం
బవిపోఁడి దఱుఁగుఁ దరువులఁ, గుసుమఫలంబులును గరము గొంచెంబు లగున్. 130

మ. ధరణీరక్షణ మాచరింపక నృపుల్ దర్పంబునం బశ్యతో
హరు లై సాధుల దోఁచి చేకొను తదీయస్త్రీధనక్షేత్రముల్
హరియింపం గలవారు దారుణతరం బై కల్లు చెల్లుం బర
స్పరవైరంబు ధరాతలేంద్రులకు విశ్వప్రాణినాశంబుగన్. 131

క. క్రమమున రాష్ట్రములును నగ, రములును నాశంబు నొందు రక్షాచ్యుతు లై
భ్రమియింతురు జను లతిదు, ర్గమగిరిసరిదంతికములఁ గడు నాతుర లై. 132

క. హేతుప్రత్యయవాదన, చేతను లై వేదనింద సేయుదురు మఖ
వ్రాతంబులు వ్రతములుఁ జెడఁ, బాతకులు దుర్మార్గకర్మపరు లై నృపుల్. 133

క. శ్రుతిధర్మంబులు శూద్రులు, ప్రతిభం జెప్పంగ వినుచు బ్రాహ్మణజాతుల్
ధృతి సెడి తత్సేవకు లై, యతినిందితకర్మకారు లయ్యెద రధిపా. 134

(భారతము.)

సీ. పదియాఱువర్షముల్ పరమాయు వయ్యెడు ధరణీశ కలియుగాంతమున వినవె
యేడు నెన్మిదియును నేండ్లప్రాయంబునఁ బ్రజ లుద్భవింతురు భామినులకు
ద్రవ్యవిహీను లై దాత యొక్కఁడు లేక యన్యోన్యతస్కరు లగుదు రెందు
నెఱిఁగెడువారును నెంతయుఁ గ్రూరు లై చెదరి పాపంబు నేసెదరు చూవె
యన్నవిక్రియ మొనరింతు రఖిలజనులు, వేదవిక్రయు లగుదురు విప్రవరులు
పణ్యా (......) యగుదురు పద్మముఖులు, కష్టతర మైనయక్కలికాలవేళ. 135

మ. వివిధవ్యాఘ్రమృగోరగాకులము లై విస్తీరశూన్యాటవీ
నివహాఖిలము లై యరాజకము లై నిర్మూలధర్మంబు లై
ద్రవిడాభీరతురుష్కబర్బరపుళిందవ్యాప్తిదుష్టంబు లై
భువిలో నెల్లెడఁ బాడగుఁ జనపదంబుల్ తద్యుగాంతంబునన్. 136

క. క్షత్త్రియజాతులు శూద్రప్ర। రిత్త్రింబున శౌర్యమును సిరియుఁ దేజంబున్,
మైత్త్రియును లేక చెడి ధ। రిత్త్రిస్వార శూద్రు లై చరించెద రెందున్. 137

క. ఊఱ వగు నారుగపంటలు। గొఱియలపాఁడియును దఱ చగుం బురుషులకున్
దొఱసలు నుట్టము లయ్యెడ। రెఱచియ భుజియింతు రర్థి నెల్లజనంబుల్ 138

క. నడవవు దేవపితృక్రియ। లుడుగును వేదార్థసమ్యగుపదేశంబుల్
గడఁగును మోహతమంబులు। పుడమి సమస్తంబుఁ గుజనభూయిష్ఠ మగున్ 139

క. గురుఁ గొనియాడఁడు శిష్యుఁడు। గురుఁడును శిష్యునెడ వంచకుండగు మది నొం
డొరువులనొల్లరుబంధులు। పొరిఁబొరిఁగఱపులగుఁబ్రజకుఁబొడమునుభయముల్ 140

తే. క్రోధమోహనామకు లైనఘోరశత్త్రు। లిరువు రెరియించుచుండుదు రెపుడు నిరుని
నంతరంగ మయ్యుభయంబు నడపకున్నఁ। గలదెయూరకబ్రాహ్మణగౌరవంబు 141

సీ. ఎవ్వఁడు సత్యంబు నెప్పుడు బల్కు హింసావిమూఢుఁడు గురుజనహితార్థి
యింద్రియంబుల నోర్చి యెల్లవారలఁదనయట్ల కాఁ జూచు ధర్మాభిరతుఁడు
కామంబు దగులండు కర్మంబు లాఱును సముచితసంప్రయోజ్యత నొనర్చు
నట్టిపుణ్యాత్ముని ననఘు బ్రాహ్మణుఁ డని యనిశంబుఁ గీర్తింతు రమరవర్య
లార్జనంబు శమము నధ్యయనంబును, బరమధనము నువ్వె బ్రాహ్మణునకు
ధర్మగతికి నవియ తగుసాధనంబులు, వేదవిదితముఖ్యవిధులు నవియ 142

చ. అరయఁగ జీవితంబు గడునల్పమ వింత యొకింగి యాత్మ నె
వ్వరికినఁ గీడు రోయక ధర్మపరం బగుమైత్రి భజించి సత్కృపా
నిరతుఁడు నిష్పరిగ్రహుఁడు నిత్యతపస్వియు నిత్యతృప్తుఁడుం
బరమశమాస్పదుండు నగుబ్రాహ్మణుఁ డొందు సనాతనస్థితిన్. 143

క. నిత్యముఁ గర్మయుఁ గర్మఫ లత్యాగియు నగుట లెస్స లౌల్యవియోగం
బత్యంత మయోగము దత్ప్రత్యయలబ్ధంబు నావె బ్రాహ్మణుఁడుమహిన్ 144

ఆ. పాపవర్తనుండు బ్రాహ్మణుం డయ్యును। నిజము శూద్రుకంటె నీచతముఁడు
సత్యశౌచధర్మశాలి శూద్రుఁ డయ్యు। నతఁడు సద్ద్విజుండ యనిరి మునులు. 145

చ. నిజగుణదోషకర్మముల నెట్టిన మేలును గీడు వచ్చుఁ ద
త్ప్రజనితసౌఖ్యదుఃఖములఁ బ్రాజ్ఞులు తుల్యమనస్కులై మనో
రుజలను దేహజంబు లగురోగములున్ హితధర్మకర్మభే
షజములఁ జేసి పాపుదురు సర్వము సాత్త్వికదృష్టిఁ జూచుచున్. 146

క. ప్రియములఁ బాయుటయును న।ప్రియములఁ బెసఁ బొందుటయును బెల్లుగ నగుద
త్క్రియలందు మూఢమతికి హృదయతాపము వాయ దెపుడు దరికొనుచుండున్ 147

తే. పగతు మన్న నెవ్వారికి పగవఁ జనదు। చిత్తమున నేమిటికి సంతసింపరాదు
కాన గతమునందును ననాగతమునందు। పగవ రార్యులు సంతోషవంతులగుచు 148

క. మగపురఁ దేజోహీనుం డగు నాత్మహితక్రియలకు నక్షముఁ డగు న
వ్వగపు దొలఁగియుద్యోగము। దగఁ జేయఁగఁ గలుగు నంచితములగు శుభములన్ 149

తే. లోకములు లోకధర్మములున్ నృపాల। రాజమూలముల్ రాజవిరహితమైన
పుడమిజనులకు నింకిన మడుగులోని। జలచరంబుల పడుపాట్లు సంభవిల్లు.

ఆ. కోరి తోఁటవాఁడు కుసుమఫలంబులు। కోయునట్లు రాజు కొనఁగవలయు
నవ్వనంబు నతికి యంగారములు సేయు। భంగి నైనభూమి పాడుకాద . 151

క. నమ్మమి మృత్యువు పెద్దయు। నమ్ముట యపమృత్యు వగుట నరపతి నమ్మ
నమ్మక పని గొనవది ని। త్యమ్మును నాత్మమతిఁ దాన యరయఁగవలయున్. 152

క. మృదుమధురవాక్యముల నిం। పొదవెడు చెలువమ్ము లోడ నుర్వీశుఁడు స
మ్మదమున సచివులకుఁ బ్రజలకు। నొదవింపఁగ వలయు నదిమహోన్నతి జేయున్. 153

—భారతము—

క. శరణం బని వచ్చిన భీ । కరశత్రుని నయినఁ బ్రీతిఁ గావఁగ వలయుం
గరుణాపరుల కెఱుం గిది । యిరవుగ సరి గావు దీని కే ధర్మంబుల్. 154

క. విను దుర్వినయాత్మకుఁ డగు । జనుఁ డుజ్జ్వల మైన సిరియు సద్విద్యయుఁ గ
ల్గిన నందు మెలఁగ నేరక । చెనఁటి తెఱంగునకుఁ జొచ్చి చెడిపోవుఁ దుదిన్. 155

తే. పిఱికితనము నేమఱుటయు మఱుపతనము । మెత్త బాటును గార్యంబు నెత్తెఱంగు
నేరమియు విషయంబులఁ గూరుటయును । గలుగుపతికి నుండదు సిరి దొలఁగిపోవు

క. క్రమమున బాహ్యేంద్రియక । ర్మము లెల్లను వదల విడిచి మహితసమాధి
క్రమదశ నుండెడి నివాత । స్తిమితం బై వెలుఁగు చున్న దీపమపోలెన్. 157

క. క్షమయు నహింసయు సత్యము । సమతయు నింద్రియజయంబు శమముఁ బరిత్యా
గమును దపోలక్షణములు । క్రమమున నిన్నియును స్వర్గగతికారణముల్. 158

శా. అన్యాయార్జిత మైనవిత్తమునఁ జేయం బూనుదానంబు మూ
ర్ఖన్యాయం బది దానఁ జేసి ఫలపాకం బేమియున్ లేదు యు
క్త న్యాయార్జిత మించుకంత యయినం గాలంబు దేశంబు స
మ్మాన్యం బై తగఁ బాత్రయోగమున సౌమ్యం బై ఫలించుం దుదిన్. 159

ఆ. ఆత్మధర్మనిరతు లైనపుణ్యాత్ములు । దుర్లభుఁడు సమస్తదురితములును
శాంతిఁ బొందు వారిసంసర్గమునఁ దీర్థ । భూతమతులు వారు భూతలమున. 160

ఆ. ప్రియము నప్రియంబుఁ బెల్లగు సౌఖ్యదుః । ఖములు భూతభావికార్యములును
నెవ్వనికి సమంబు లివి సర్వధని యనఁ । బరఁగుఁ జావె యట్టి భవ్యుఁ డనఘ. 161

క. మన్నన కుబ్బక యవమతి । ద న్నొందిన స్రుక్కఁ బడక ధరణీశుకడన్
ము న్నున్నయట్ల మెలఁగిన । యన్నరునకు శుభము లొదవు నాపద లడఁగున్. 162

ఆ. యోగ్యతృష్ణఁ దగిలి యనుచితంబు గోలఁది మై । నడచునట్టివారు బెడిదములకు
నంత నొత్తు రట్లు సంతాపకారుల । కాక పెనఁకువలు సుఖంబు లగునె. 163

క. బలవంతుఁడు పై నెత్తిన । బలహీనుఁడు, ధనము గోలుపడినయతఁడు, మ్రు
చ్చిల వేచువాఁడుఁ, గాముఁ । కులచిత్తుఁడు నిద్ర లేక కుందుదు రధిపా. 164

క. కోపము, నుబ్బును, గర్వము, । నాపోవకయునికియును, దురభిమానము, ని
ర్వ్యాపారత్వము ననునివి । కాపురుషగుణంబు లండ్రు కౌరవనాథా. 165

క. నడవడి యనుమున్నీటిం । గడవం బెట్టంగ నోడ కరణిం దగి తా
నోడఁగూడదు ననిన సత్యము । గడచినగుణ మింక నొండు గలదే యరయన్. 166

ఆ. కమియఁ బండ కుండఁ గాయఁ గోసినఁ జవి । చేటు కాదు విత్తుచేటుఁ గలుగుఁ
బక్వ మగుడుఁ గోయ ఫల మిచ్చుఁ జెడదు బీ । జంబుఁ గార్యసిద్ధిచంద మిట్లు. 167

తే. మాలకరిపుష్పములుగోయుమాడ్కిఁ దేఁటి।పువ్వుఁ దేనియఁగ్రోలెడుపోల్కి నెదురు
గందకుండఁగఁగొనునది కార్యఫలము।బొగ్గులకుఁబోలె మొదలంటఁబొడువఁజనదు. 168

ఆ. కలహ మగుడు లక్ష్మి గావించుఁ బ్రాణహా । నియును జేయు నింత నిక్కవంబు
పలువు రొకని కోడి పాలుట బల్లిదు । లనదచేతఁ జెడుటయును ఘటించు. 169

క. పగవారియింటఁ గుడిచిన । నగుఁ దమ కనుమాన మమృత మైనను దారుం
బగతురకుఁ గుడువఁ బెట్టఁగఁ । దగ దొడలుల కెప్పు డెవ్విధము వాటిలునో. 170

క. దొరఁకొని పుణ్యముఁ బాపము । నరుఁ డర్థిం జేయు చుండ నడుమ నొకంటన్
వెర నెడలి తప్పినను ద । త్ఫలితఫల మొందు నండ్రు ధర్మవిధిజ్ఞుల్. 171

ఉ. సారపుధర్మమున్ విమలసత్యముఁ । బాపముచేత బొంకుచేఁ
బారముఁ బొంద లేక చెడఁ బాలివి యైనయవస్థ దక్షు లె
వ్వార లుపేక్ష సేసి రది వారలచే టగుఁ గాని ధర్మని
స్తారక మయ్యు సత్యశుభదాయక మయ్యును నైవ ముండెడున్. 172

క. బలవంతులబలములు న । గ్గల మగుబల మెదురఁ గలుగఁగాఁ గీడ్పడు నే
కొలఁదులవారికి గర్వము । నిలుచునె నయమార్గవృత్తి నిలిచినభంగిన్. 173

చ. బవరము సేయు చుండియును భాషణముల్ దగఁ బల్కుచుండఁగా
సవినయవృత్తి మై వలవ డాయుధ మార్చుటఁ దాఁకి పడ్డఁ గై
దువు వడిఁ దొలంగినను దోర్బల మేది భయంబుఁ బొందినం
గవియక బీఱు వోయినను గాను వధింపఁగ సెట్టిశత్రునిన్. 174

క. పురుషుఁడు సెడు ననువాఁడును। బురుషుఁడు సెఱుచు నని పలుకుపురుషుండును న
య్యిరువురు నవివేకుల య్యు। పురుషుఁడు సెఱుపందు సెడఁడు భుజవీర్యనిధీ 175

క. జ్ఞాతులు దమలోఁ బొందినఁ। జేతోమోదమున బెలిఁగి చెలు వొందుదు ర
న్నీతిం బాపిన విగిలివి। భూతిం గడకొలవులట్ల పొగయుదు రధిపా. 176

క. శరణం బని వచ్చిన భీ । కరశత్రుని నయినఁ బ్రీతిఁ గావఁగ వలయుం
గరుణాపరుల కెఱుం గిది । యిరవుగ సరి గావు దీని కే ధర్మంబుల్. 154

క. విను దుర్వినయాత్మకుఁ దగు । జనుఁ డుజ్జ్వల మైనసిరియు సద్విద్యయుఁ గ
ల్గిన నందు మెలఁగ నేరక। చెనఁటి తెఱంగునకుఁ జొచ్చి చెడిపోవుఁ దుదిన్ 155

తే. పిఱికితనము నేమఱుటయు నుఱుకతనము । మెత్తబాటును గార్యంబు నెత్తెఱంగు
నేరమియును విషయంబులఁ గూరుటయును। గలుగుపతికి నుండదు సిరి దొలఁగిపోవు

క. క్రమమున బాహ్యేంద్రియక । ర్మము లెల్లను సదల విడిచి మహితసమాధి
క్రమదశ నుండెడి నివాత । స్తిమితం బై వెలుఁగు చున్నదీపమపోలెన్. 157

క. క్షమయు నహింసయు సత్యము। సమతయు నింద్రియజయంబు శమముఁ బరిత్యా
గమును దపోలక్షణములు । గ్రమమున నిన్నియును స్వర్గగతికారణముల్. 158

శా. అన్యాయార్జిత మైనవిత్తమునఁ జేయం బూనుదానంబు మ
గ్ఘన్యాయం బది దానఁ జేసి ఫలపాకం బెన్నియున్ లేదు యు
క్తన్యాయార్జిత మించుకంత యయినం గాలంబు దేశంబు స
మ్మాన్యం బై తగఁ బాత్రయోగమున సౌమ్యం బై ఫలించుం దుదిన్. 153

ఆ. ఆత్మధర్మనిరతు లైనపుణ్యాత్ములు । దుర్లభులు సమస్తదురితములును
శాంతిఁ బొందు వారిసంసర్గమునఁ దీర్ఘ । భూతమతులు వారు భూతలమున. 160

ఆ. ప్రియము నప్రియంబుఁ బెల్లగుసౌఖ్యదుః । ఖములు భూతభావికార్యములును
నెవ్వనికి సమంబు లివి సర్వమని యనఁ। బరఁగుఁ జూవె యట్టి భవ్యుఁ డనఘ. 161

క. మన్నన కుబ్బక యవమతి । ద న్నొందిన స్రుక్కఁ బడక ధరణీశుకడన్
ము న్నున్నయట్లు మెలఁగిన। యన్నరునకు శుభము లొదవు నాపద లడఁగున్. 162

ఆ. రోగ్యతృష్ణఁ దగిలి యుచితంబు గొలఁది మై । నడచునట్టివారు బెదిదములకు
నంత నొత్తు రెట్లు సంతాపకారుల । కాక పెనఁకువలు సుఖంబు లగునె. 163

క. బలవంతుఁడు పై నెత్తిన । బలహీనుఁడు, ధనము గోలుపడినయతఁడు, ము
చ్చిల వేచువాఁడుఁ, గాముఁ । కులచిత్తుఁడు నిద్ర లేక కుందుదు రధిపా. 164

క. కోపము, నుబ్బును, గర్వము, । నాపోవకయునికియును, దురభిమానము, ని
ర్వ్యాపారత్వము ననునివి । కాపురుషగుణంబు లండ్రు కౌరవనాథా. 165

క. నడవడి యనుమున్నిటిం । గడవం బెట్టంగ నోడ కరణిం దగి తా
నోడఁగూడదు ననిన సత్యము । గడచినగుణ మింక నొండు గలదే యరయన్. 166

ఆ. కమియఁ బండ కుండఁ గాయఁ గోసినఁ జవి । చేదె కాదు విత్తుచేటుఁ గలుగుఁ
బక్వ మగుడుఁ గోయ ఫల మిచ్చుఁ జెడదు బీ । జంబుఁ గార్యసిద్ధిచంద మిట్లు. 167

తే. మాలకరిపుష్పములుగోయుమాడ్కిఁ దేఁటి।పువ్వుఁ దేనియఁ గ్రోలెడుపోల్కి నెదుర
గందకుండఁగఁ గొనునది కార్యఫలము।బొగ్గులకుఁ బోలె మొదలంటఁ బొడువఁ జనదు. 168

ఆ. కలహ మగుడు లక్ష్మి గావించుఁ బ్రాణహా । నియును జేయు నింత నిక్కువంబు
పలువు రొకని కోడి పాఱుట బల్లిదు । లనదచేతఁ జెడుటయును ఘటించు. 169

క. పగవారియింటఁ గుడిచిన । నగుఁ దమ కనుమాన మమృత మైనను దారుం
బగతురకుఁ గుడువఁ బెట్టఁగఁ । దగ దొడలుల కప్పు డెవ్విధము వాటిలునో. 170

క. దొరఁకొని పుణ్యముఁ బాపము । నరుఁ డర్థిం జేయు చుండ నడుమ నొకంటన్
నెర వెడలి తప్పినను ద । త్పరిణతిఫల మొందు నండ్రు ధర్మవిధిజ్ఞుల్. 171

ఉ. సారఁపుధర్మమున్ విమలసత్యముఁ । బాపముచేత బొంకుచేఁ
బారముఁ బొంద లేక చెడఁ బాలివి రైనయవస్థ దక్షు లె
వ్వార లుపేక్ష సేసి రది వారలచే టగుఁ గాని ధర్మని
స్తారక మయ్యు సత్యశుభదాయక మయ్యును గైవ ముం డెడున్. 172

క. బలవంతులబలములు న । గ్గల మగుబల మెదురఁ గలుగఁగాఁ గీడ్పడు నే
కొలఁదులవారికి గర్వము । నిలుచునె నయమార్గవృత్తి నిలిచినభంగిన్. 173

చ. బవరము సేయు చుండియును భాషణముల్ దగఁ బల్కుచుండఁగా
నవినయవృత్తి మై వలన దాయుధ మార్చుటఁ దాఁకి పడ్డఁ గై
దువు వడివం దొలంగినను దోర్బల మేది భయంబుఁ బొందినం
గవియక బీఱు వోయినను గాదు వధింపఁగ నెట్టిశత్రునిన్. 174

క. పురుషుఁడు సెడు ననువాఁడును। బురుషుఁడు గెలుచు నని పలుకుపురుషుండును న
య్యిరువురు నవివేకుల యా। ప్పురుషుఁడు గెలుచుండు సెడుఁడు భుజవీర్యనిధీ 175

క. జ్ఞాతులు దమలోఁ బొందినఁ। జేతోమోదమున వెలిఁగి చెలు వొందుదు ర
వ్నీతిం బాసిన విగతివి। భూతిం గడకొఱవుల్లట్లు పొగయుదు రధిపా. 176

క. తేరు శరీరము, దానికి। సారథి సర్వేశుండు, తురగచయ మింద్రియముల్,
గారుణికబుద్ధివాగ్వ్యా। పారంబులు దనరు జనుపసర్గము లధిపా. 189

క. కలిమియె చుట్టలఁ జేర్చుం। గలిమియె చెలులను ఘటించుఁ గలిమియె శౌర్య
శ్లాఘలఁ దనిపించుం గలిమియె। పలువురు సద్బుద్ధి యనఁగఁ బరఁగం జేయున్. 190

క. కేవలనిష్కామక్రియ మో। హావహ మగు నేని గిరులు నఃఫీజములున్
భూవర! ముక్తిం బడయం। గావలదే యడవి నునికి కైవల్యపదం. 191

చ. వినుము త్రిమోహమయం బయినవిశ్వముఁ దా వెలిగించు విశ్వరుం
డన నొకరుండు నగ్ణ్రతతి నాశ్రిమకోటిని వాఁడు గాదె చే
సె నిఖిలకర్మయోగవిశేషతి గల్గుటయుం బదియక
ల్పనము శదాజ్ఞకుం దొలఁగఁ బాపినచో శోకము గాఁగణంబుగన్. 192

క. రక్ష ప్రజ గోరు నిజయో। గక్షేమార్థముగ జనసుఖస్థితి నడపన్
దక్షుఁ డగు రాజు నడప కు। పేక్షించిన బాప మొందదే కురుముఖ్యా. 193

క. నరరూపంబునఁ బరఁగెడు। పరదేవత గాక నృపుఁడు బాలుఁ డయిన న
ప్పురుషునెపె నేమి హా ప్మని। తిరిగినదుష్కృతులఁ బొందదే కుపఠిపా. 194

క. పండార్థు లైనవారల। దండింపక యున్నఁ జాప్ప దాత్రీవిభు నా
ఖండలసన్నిభు నైనఁ బ్ర। చండపుకిల్బిషము వొందు జగతీనాథా. 195

క. పేదలకును సాధులకును। వేదములకుఁ దాపసులకు వేయేల సమ
స్తాశ్రితులకును దండము। కాదె బ్రదుకుఁ జేయు రాజు గావింపంగన్. 196

ఆ. ఉచితదండవృత్తి నుర్వీప్రజాభిర। క్షణము నోపి చేఁత గాక రాజ
వంశజునకు ధర్మవాభూసురాగ్రంబు। లైనశమపమాదు లాత్మ నిడుట. 197

తే. కామభోగముల్ మే లనగాదు వాని। విడిచి చూడుము పొందదు విఫలసుఖము
కాయ లాకులు నీళ్ళును గాలి యనుభ। వించియున్న మునీంద్రులు వెత్తివారె. 198

క. దుష్కృతు లామిషగత మగు। కర్మము వాటించి బంధ కలితు లగుదు ర
య్యాసక్తి గడచి సువిచారులు। నిష్కాములు ముక్తి వడయ నేర్తురు వత్సా. 199

ఉ. ఆదటఁ బూర్వశాస్త్రములయర్థము లారఁగఁ గోరి తత్త్వసం
వేదనుధారసంబునఁ జవిం జిరసౌఖ్యముఁ బొంద నేర కీ
వ్మృదిని నెందునుం దిరిగి మే లని కర్మమ యూఁది చెప్పుచుం
గా దని శాంతి యొప్పనిది గాఁ జెపనాడుదు గల్పబోధనుల్. 200

క. విమలజ్ఞానముఁ దపమును। దమమును త్యాగంబు శాశ్వతపరమానం
దమునకు మూలము లందురి ని। జముగాఁ గైకొం డ్రివియ ప్రసన్నవివేకుల్ 201

ఉ. కామముఁ గ్రోధమున్ మనసు గాఁడఁగఁ బాలుట మాన్చి యింద్రియ
స్తోమవిమార్గవర్తనము దుంచుచు నెవ్వగ లేక రక్షణం
బేమఱ కెవ్వరిం జెనకి యుంచక నొంపక లోక మేలఁగా
నామహితాత్ము సర్వమహిమాతిశయంబును జెందు (విప్పలున్.) 202

ఆ. న్యాయశాస్త్రవేది యై యింగితాకార। చేష్ట లెఱిఁగి జనుల శిష్టదుష్ట
తావిశేష మరసి దండనీతి యొనర్పు। పతికి నెల్లమేలు పడయ వచ్చు. 203

క. అరి యాజవపా ల్గొనుచుం। గరుణ గలిగి ప్రజలఁ దండ్రిగతి మధ్యస్థా
చరణంబునఁ బాలించుట। పరమపదముఁ జేర్చు (నోడుచు) భయసంశయముల్ 204

చ. క్రమమున నెట్టిశాత్రవులఁ గ్రిందున నైనను జాఁపఁ జేఁత ధ
ర్మము విను పాపకర్మ లగురాజులతోఁ దగసంధి సేఁత దో
షము విభుఁ దుర్వి యమ్మకొని సంగరముం దొలఁగింపఁ గూడునే
సమరజితావనీభరణశాలితఁ బోలునె యొండునర్మముల్. 205

తే. కల్లు ద్రావుట గురుపత్ని గవయుటయును। విప్రుఁ జంపుట బ్రహ్మస్వాపహరణ మైన
మ్రుచ్చిలుటయు నునివి గలవారిఁ జనుల। ప్రీతిఁ బొందుటయును మహాపాతకములు.

క. వినుఁడీ సుఖమును దుఃఖము। ననిత్యములు గాన హాని యాగమకాలం
బున ముదమును శోకము మొగి। కొనమియ చుమ్మ అవు శాంతి గోరుజనులకున్

తే. మూఢతమబుద్ధు లగువారుఁ బ్రౌఢతమవి। వేకు లగువారు సుఖు లట్లు గాక కొంత
ప్రజ్ఞ గలవార లై యపప్రతిభు లైన। జనులు దుఃఖార్తు లగుట నిస్సంశయంబు. 208

తే. పాదలుఁ దఱుఁగుటకై పాద వెదుగఁబడుట। కైకడుం జేయఁ బాయుటకై జనించు
బొలియుటకు నై సుఖంబులఁ బొందుదురిక। మొందుటకు నై పదార్థము లెందు నధిప.

చ. పల నధికంబుగాఁ గలుగు వైద్యులు శాస్త్రము లభ్యసించి మం
దుల నొడఁగూర్ప నేర్చి తనుదోషము లారయుబుద్ధి గల్గి యా
ర్తులకుఁ జికిత్స సేయుదురు రోగము వాయమి లేద వారు రో
గు లగుట గాన మెల్లు ప్రతికూలవిధిన్ నరు నేర్పు దోఁచునే. 210

క. జననజరామరణగ్రా। హనిబిడకాలాబ్ధిమగ్న మని జగము నెఱిం
గినవాఁడు ధర్మవర్తన నము। నుండుం జింత పక్క భూపవరేణ్యా. 211

క. తనయొడ లెరవనిన మను। జునకును బంధుతతి సతమె శోకించిన వ
చ్చునె చచ్చినజంతువు నె। మ్మన మధికము నొచ్చుఁ గాక మహితవిచారా. 212
తే. మాతృపితృదారపుత్త్రికభ్రాతృశతస। హస్రకంబులు సంసృతి ననుభవింపఁ
బడియె నం దెవ్వరికినని యడలువాఁడు। నరుఁ డనిత్యత యూహించు టగయ నుఱవు.
క. నరవర సరసాన్నంబులుఁ। బరిమళసద్వస్తువులును బరమశయనవి
స్ఫురిములుఁ గాలాధీనా। నరుఁ బొందుం బాయు వాని నమ్మమియ యుఱున్.214
మ. మనుజాలు సేయ నెవ్వరు సమస్తము నీశ్వరునాజ్ఞఁ జెన్నెడున్
వినుము కుఠారపాణి ధరణీరుహముల్ నఱకంగఁ బాప మొం
దు నొకో కుఠారముఁ జనులు దోసముఁ బొందరు కర్త యీశ్వరుం
డనియెడినిశ్చయంబు దృఢమై మది నిల్వఁగఁ జాలు భూవరా. 215
క. దురమునఁ గైదువుఁ గొని తను। బొరిగొను నేతెంచునట్టిపురుషుని వేదాం
తరహస్యవేది నఱకినను। బొరిగొనినం బాతకంబు పొందదు వత్సా. 216
తే. అతిథిపితృదేవతాపూజ లాచరించి। కాని గృహమేధులకు భోజ్యమైనఁ గుడువఁ
దగదు యజ్ఞశిష్టం బమృతంబు గాఁగ। నార్యజనములు చెప్పుదు రధిపవర్య. 217
క. ఆలును బిడ్డలు బంధులు। నై లీలఁ జరించుచును గృహస్థుఁడు దత్త
జ్ఞ్యాలత్వాగ్రహితచిత్తత। మేలుగ నలవఱుప వలయు మీఁద దలఁగి నృపా. 218
తే. పందునకు బిడ్డ నిచ్చినచంద మొందు। బూదిలో నేయి వేల్చినపోల్కి నోటి
కవపలో నీళ్ళు నట్టినకరణి యగు న। పాత్రజనులకుఁ బెట్టుట పారవేంద్ర. 219
క. శిల చేతమ్రాను దెప్పగ। జలనిధిఁ గడవ దొరఁకొనినచా ద్పుగుఁ బాత్రం
బులు గానివారిఁ జల దానం। బులఁ బాపము నిస్తరింప బుద్ధిఁ దలఁచినన్. 220
ఆ. పురకఁ గుక్కతిత్తిఁ బోసినపాలు నీ। ళ్ళధికనింపఁ బోరయుఁ నెల్ల దుష్ట
మై యపాత్రవిషయ మగునీగి వృథపోవు। నిచ్చుచోటఁ బాత్రి మెఱుగవలయు221
ఉ. రాజటె రాగహీనుఁ డట రాజితమందరమూర్తి యట్టె వి
భ్రాజితసంపదున్నతివిభాసితహస్తముఁ డట్టె కామినీ
రాజిమనోజ్ఞభంగిచతురస్వధనుండు డటె బ్రహ్మచార్యదీ
క్షాజితమన్మథుండు నటె జన్మము లిట్టివి యెందుఁ గల్గునే. 222

క. తరణి వొడిచి తమము వెలుచు। కరణిని లోకమునఁ గలుగుకల్మష మెల్లన్
ధరణిపతి ధర్మమార్గ। స్ఫురణంబునఁ జెఱుచు విమలబోధచరిత్రా. 223

క. దాంతియుఁ బ్రియవాదిత్వముఁ। శాంతియు శీలంబుఁ గలుగుజగదీశుఁడు శ్రీ
మంతుండు యశస్వియు నై। యెంతయు సౌఖ్యంబు నొందు నిభపురనాథా. 224

తే. ప్రకృతు లేడింటిఁ దగ నడపంగవలయు। దాని కార్యసత్వముల్ దావలములు
దండనీతివిధాన మంత్రతతికి రక్ష। యర్థ మగు మెల్పుతోఁ జేయ నది నెలుంగు. 225

క. గురుతల్పగు భ్రూణహునిన్। నరేంద్రవిద్వేషి బ్రాహ్మణఘ్నునిఁ జెలుచన్
ధరణి వెడల నడువవలయు। శరీరనిగ్రహము సేయఁ జనదెవ్వేషలన్. 226

మ. పరిహాసంబునఁ దేలి భృత్యులయెడం బ్రహ్లాదమును బొందుభూ
వరునాజ్ఞం జన రీగి మెచ్చరు పనిన్ వంచింతు రగ్గాడిఁ జో
త్తురు కౌతూహలవేషభాషణములం దుల్యత్వముం బొంది యే
తురు వా రెల్లపదంబుఁ గోరుదురు గొందుర్ భూమి మాఱోడ్డులన్. 227

క. అవలేపంబునఁ గర్త। వ్యావివేకము లేక వలసినట్టుల యెవ్వా
డవనీతి సేయు ధరణీ। ధవుఁడు విడువవలయుఁ దన కతఁడు గురుఁ డైనన్ 228

క. పాపరిచి యాడెడుమాటలఁ। గోనఁ దలఁపక దుర్వినీతకోటిధనంబుల్
వెస కెక్కి నష్టిరెప్పులఁ। గొని సుజనుల కీగి నృపతి గుణ మందు బుధుల్. 229

క. ధన మపహరించుటయు। తన కనిశముఁ బనిగాఁగ బ్రదుకు నతిలుబ్ధకున్
విను శత్రులచే నాటకు। మును దనప్రజచేతఁ జేటు మూఁడు నరేంద్రా. 230

ఆ. ధర్మరతులు నర్థనిర్మాణచతురులు। లౌల్యరహితులును నలంఘితాజ్ఞ
లుని సునీతినిపుణులును గులజులు నగు। పరిజనములఁ బెనుపుపతికి హితము. 231

ఉ. కానిపథంబునం జనక కారుణికత్వము గల్గి శాంతిమైఁ
దా నడపంగ విప్రవిను దారిధనం బొసఁగూడ నేని సం
తానము పూర్వ కర్తలకు ధర్మనిరూఢతఁ బంచి పెట్టి దు
ర్మానవిదూరుఁ డై పరఁగఁ బ్రాప్తుఁడు కౌరవవంశదీపకా. 232

చ. యజనము దానకర్మమును నధ్యయనంబును దస్యుహింసయుం
బ్రజ్ఞకనురాగ మొందఁ బరిపాలనసేఁతయు సంగరంబునన్
విజితవిభీతి మై నురవణించుటయున్ నృపధర్మముల్ గురు
ప్రజతిలకాయమాన సమరంబు సుధర్మము వీనిలోపలన్. 233

మ. గురుశుశ్రూషయు నాగమాధ్యయనముల్ గోష్ఠీనిరాసంబుఁ ద
త్పరతం బొం దొరయంగఁ దాఁ జోరమియును భైక్షాశనత్వంబు ప
ద్వరకర్మంబులయందు రాగభరగాఢద్వేషముల్ లేక యీ
ప్సారితోషం బగ గాక యున్కియును భవ్యబ్రహ్మచర్యోక్తముల్, 234

శా. తానుక్ భార్యయు నేఁగుఁ బేరడవికిం దా నొక్కఁడైనం జనున్
మానాహంకృతు లూన్చి నింద్రియములన్ మర్దించు నచ్చో జడల్
పూనుం దాపసశాస్త్రముల్ సమువుఁ ల్పున్ గోష్ఠి తజ్జాళితో
వానప్రస్థవిధాప్రవిష్టుఁడు పరీవాత్సల్యనిష్ఠాత్ముఁ కా. 235

శా. ఎచ్చో నైనను నిల్చు నాతలికి నేమేనిం గొనుక్ రాత్రి యై
నచ్చో నెమ్మి శయించు నగ్నిపరిచర్యం బాసి వర్తించుఁ దా
నిచ్చం గోరఁ డొకండు నింద్రియజయం బేపారుభోగంబులక్
మెచ్చక్ మొక్కును నొల్ల కుండు యతి పేర్మిన్ నిర్మలుం డై నృపా. 236

క. తరణిశశాంకుల్ తేజ। స్ఫూరణము లేకున్నయట్లు భూజనములు ని
ష్కారుణికతఁ జెడ్పడుదురు। నరపాలకహితపాలనము లేకున్నక్. 237

క. రాజునకుఁ బ్రజ శరీరము। రాజు ప్రజకు నాత్మ గాన రాజుం బ్రజయుక్
రాజోత్తమ యన్యోన్యవి। రాజితు లై యుండ వలయు రక్షార్చనలక్. 238

క. తనుఁ దాన తొలుత గెలువన్। మనుజపతికి వలయుఁ బిదప మార్తుర గెలువన్
మనమునఁ దలంచునది మును। దను గెలువనిపతికి గెలువఁ దర మే జగతిన్ 239

క. ఆరామాదికనిజసం। చారస్థలములకు దేశసంఘలకుఁ బురీ
ద్వారములకు నగరికిని ధ। రారమణుఁ డొనర్పఁ లయు రక్షలు నియతిన్. 240

తే. అర్థులకడ నిజభూమియం దనుజతనుజ। బాంధవామాత్యమిత్త్రుల పాల వేస
ధగుల వేగులఁ గాఁ బెట్టి ధరణిపునకుఁ। వలయు నొండొరు నెఱుఁగనికారు గాఁగ

ఆ. కయ్యమునకు వలదు కాల్దిర్వ నధిప నా। మనమున భేదమునను మార్గమనము
మెత్తఁ జేసి చెఱచి మేవడిఁ దప్పించు। కొను తెలం గెలింగికొనుట మేలు 242

చ. జనకుఁడుఁబోలె నర్మిలిఁ బ్రజం బరికించుచు వష్ఠభాగముం
గొనునది వారిచేత నరిఁ గోటివిధంబుల నాస్త్రదక్షులం
గని వనగోకులాకరనగప్రముఖార్థకరంబు లారయం
బనుచుచు నన్నిటన్ ధరణిపాలుఁడు గన్నది యున్నఁ బెం పగున్ 243

తే. తనకు మేలొనరించునాతండు మిత్త్రుఁ డతఁడు వడపంగ నెల్లకార్యములు శుభము
నొందు నేమిట నేమఱకునికితోడ। నృపుడు మిత్త్రుపైఁ గార్యముల్ నిలుపవలయు.

క. బలఁగము గలభూపాలుఁడు। గెలనిమహీశ్వరులబుద్ధికిని వేఁగుచున్
బలియుఁ డగు లేనివానిం। జాలకనగాఁ జూతు రెట్టి శూరుం డైనన్. 253

క. ఎక్కువతక్కువమాటలు। నుక్కివములు నెందుఁ గీడు నొందించుటయుం
జెక్కు దనయన్నదమ్ములు। దిక్కున సన్నియును పైఁపఁ దేజము సేయున్. 254

క. లోపల రాఁజూచుఁ బోగయుచుఁ। బాపంబులు డిలఁతు రోపి బలిమియు వెఱపుం
జూపక తక్కువు కెలనికి। నేపాటను వారి నడపు లెంతయు నొప్పున్. 255

క. మృదుమధురవాక్యముల నిం। పొదవెడుచిఱునవ్వుతోడ నుర్వీశుఁడు స
మ్మదము సచివులకుఁ బ్రజలకు। నొదవింపఁగ వలయు నది మహోన్నతిఁ జేయున్

క. నఱకుట యుద్ధముఁ గొనుటయుఁ। జెఱ నునుచుట కట్టి యడిచి చేడ్పాటొందం
బఱచుట మొదలుగఁ గలపలు। దొఱఁగులఁ దగు మెయిని నడపు ధీరవిచారా. 257

క. తనకడకు వచ్చి మొగి మో। దనివాఁ డగుమాత్ర వల్కుటకుఁ గోపింపం
జనదు జననాథునకు దూ। తువిఁ జంపిన నరక మగుట ధ్రువ మని రాజ్యాల్. 258

తే. కులము శీలంబు హితవాక్యములును నేర్పుఁ। గావ్యవాదిత్వసద్వ్యవహారగౌరవంబుఁ
దలఁపు గలుగుట దక్షత యలఘుగుణము। లందుఁ బ్రమాత్రకు నియ్యొదు నార్యజనులు.

క. మొన దీర్చువెరవు యంత్రము। లనేకము లొనర్చనేర్పు నాయుధముల వి
న్ననువును బోటులకోర్చు। బును సేనాపతికి నైజములు గా వలయున్. 260

క. తనయుల నైనను నమ్మరు। జనపతి సిరి గోలుపోవుఁ జతురతమైన
విశ్వసవాఁడపోలె నమ్మక। యునికి సకలజనులయెడల నుగ నై యుండున్. 261

క. చోరులచేఁ జెడ కుండం। గ్రూరులచేఁ జావ కుండఁ గుసలయజనులన్
జారులచేఁ బడ కుండ ధ। రారమణుఁడు నేర్పు గలిగి రక్షింపఁ దగున్. 262

క. అవ్రు దేహోద్యముఁ గృషియున్। సవరణలును బనులసొంపు సరి యట్లగుటన్.
భువి బలుసు గలుగుకాఁపుల। నవనీశుఁడు గన్నబిడ్డల యట్లరయఁ దగున్. 263

క. అరి మిగులఁ గొనుట కీర్తిపులఁ బోరివాలంగఁ బిరికినట్లు భూవర కదుపుల్
వెరవునఁ బెనిచినయట్లగు। నరపతి ప్రజచేత నప్పనము దగఁ గొనినన్. 264

క. విను కర్షకులును వణిజులు। ననఘా గోరక్షకులు ధరాధీశునకున్
ధన మొదవఁగూడెడుపోటులు। కనేకవిధములకు నెల్ల నావ్యవస్థలముల్. 265

తే. ధనములకు ధాన్యములకు నుత్పత్తిస్థలము। లయినవాని కించుకయును హాని గాక
యుండఁ దనకును బండారమొదవఁ దగును।పోషణము సేయ వలయు భూపాలకుండు

క. పులి గూనలఁ దినుచందము। గలిగిన నంతటన నిలుచుఁ గాక ధనంబుల్
గలుగునె మీఁదం గావున। జలగ దిగిచినట్లు గొనఁగఁ జను నిల సొమ్ముల్. 267

క. అరయుటఁ బ్రజ వర్ధిల్లఁగ। నరి యేఁటేఁటఁ గ్రమవృద్ధి యానట్టులుగా
నరపతికిఁ గొనఁగ వచ్చు। స్వైరవృత్తిఁ బెంపంగఁ జాల నెఱయు ధనంబుల్. 268

క. దమియింపఁ దగినవారల। సమయమున దమించి వారి సంపదలు మహీ
రమణుండు దనదుబండా। రముగా సమకూర్చు జనము రాగిల్లంగన్. 269

క. ఆపనికిఁ గీడు గొయ్యము। భూపాలుఁడు ధనము గలుగుపురుషులసిరిఁ దాఁ
జూపోపక కొనఁదగదు ద। యాపరుఁడై పెంప వలయు నఖిలజనములన్. 270

క. ఆయతి కిమ్మెయిఁ గలుగును। పాయంబులు ధర్మమార్గఫలితంబులుగాఁ
జేయుటయె మేలు నృపతికి। మాయాకృతినిప్రుఁగుఁ డగుట మతి గాదు సుమీ. 271

తే. భూతసమృద్ధులు ఘనలాభములును గలుగు। ధర్మమునను రా జనువాఁడు ధర్మరతుఁ
డై జనించెను గావున నతఁ డెగ్గోష। కాముఁడై ధర్మనిరతుండు గాఁగ వలయు 272

మ. పరనారీగమనాదిదోషములు భూపాలుండు సేయంగ న
ధ్ధగవున్ విఘ్నము లేక యుండుఁ బ్రజకున్ దైన్యంబు వాటిల్లఁ జె
క్కుఁ రుజల్ పైకొను నెందునుం గలయ నుక్కుం దేజముం దక్కు న
ధ్ధరిసైన్యంబుల శస్త్రాస్త్రములు బంధుశ్రేణికిం జేటగున్. 273

క. కాని చెయిదములు సేయక। మానధర్మమునను నడచునుర్వీశుఁడు సం
తానము బంధులుఁ బ్రజయును। దానును సేనలును శుభము దలకొనఁ జేర్చున్ 274

క. క్షమ మే లగు నైన నతి। క్షమ దైన్యముఁ దెచ్చు నెదురు గర్వించినఁ గ
య్యము పోఁడిమి గెలిచి యరికే। శము నెడ సదయత్వ మావిశదుఁ డగుటొప్పున్ 287

చ. అరిపయి వీఁక నెత్తి చనునప్పుడు దేనియ లుట్టునట్లుగా
నరపతి వారివారలు వినం బ్రియ మాడుట మేలు, పక్షిఁ దాఁ
దిరముగఁ జేరఁగా మృగము తేఁకువ వాపను వేఁటకాఁడు త
త్స్వరములు నూపి కాదె తుది జంపఁ దగుం దనబారిఁ బాటినన్ 288

క. కాలవిపర్యయమున నర। పాలుఁడు దా మొక్కి యైనఁ బగతుఁ గలసి త
చ్ఛీల మెఱిఁగి తఱి యైనం। గాలునిపురి కనుచునది సుకరముగ వానిన్. 289

క. అనడిగనంబును బెడిదపుఁ। దనమును లే కుండఁ బరఁగి దరియొత్తెను నే
లను బోలె నోర్తెఁ నలయును। మనుజేంద్రుఁడు మార్తకం గ్రమంబున నధిపా 290

క. పెక్కండ్రితోఁ డ నీరస। మెక్కటిజెన కొనక తఱిఁగి యున్నపగరతో
ను క్కారి బంధుభావముఁ। దక్కటిపగరయెడ వలయుఁ దా నెఱపంగన్. 291

తే. అర్థసంతుఁ డై భోగంబు లనుభవింపు। చున్నయప్పుడ యిటె యిట్టాలుండ నేర
ద్దిర్ఘసమ తానులోనుగా ననియెఱుంగు। నతఁడు వగ బొందఁడేని యొక్లైన నధిప. 292

క. కానియటు లుండి నెఱిఁ బడు। నైన తెఱఁగు దోఁచి మాయ మను నిర్భంగిన్
మానసమున కుబ్బు పగయు। దేనోపుం బనులు బుధుఁడు దేలఁడు రెంటన్. 293

క. గతమునకును వగవక యా। గతమునకును నోపు తెలిచి కడుఁ గోరక దీ
నతఁ బొందక నైశం జే। గతి బంచిన దానఁ బోదుఁ గా కనవలయున్. 294

క. వెన్నను లావును గలిగిన। పురుషులు లే రెల్ల లోకమున నెవ్వరికిన్
సిరి శాశ్వతంబె యని వగ। బొరయఁడు ధీరుండు కలిమిపోకకు నధిపా. 295

క. ధర్మ మధర్మముభంగి న। ధర్మము ధర్మంబుమాడ్కిఁ ధరలోఁ దోఁచున్
నిర్మలమతి వరియ నలయు। ధార్మికతన కోరువాఁడు తన శ్రేయంగన్. 296

క. వాకిరిమాటలఁ దేలక। భావంబునఁ గీడు మేలుఁ బరికించి యస
ద్భావుని సద్భావుని నవ। నీవర యెగ్గులను నెఱుఁగ నేరఁగ వలయున్. 297

ఆ. అరినృపాలు పెంపు నాత్మీయశక్తియు। నెఱిఁగి మూర్ఖవృత్తి నెగడవలెక
యుద్ధవృత్తి నవనియున్నతి మేపడిఁ। గపపి హీనబలుఁడు చెడక నిలుచు. 298

క. కిరణములభంగిఁ జతురపుఁ । బరిజనముల నెందుఁ జొనిపి పరకృత్యంబుల్
నిరతంబును గనుగొనుచును । దరణికరణి వెలుఁగు టొప్పు ధరణీశునకున్. 299

చ. అనయముఁ బేర్చు కామమున నర్థము ధర్మముఁ గ్రాఁగు కామతం
త్రనిరతుఁ డైనవాఁడు నుపథప్రతిపన్నుఁడు గాఁడు దుష్టదం
డన మొనరింపఁ డట్టిపతి డాయరు సాధులు నార్యులున్ సుహృ
జ్జనములు దానఁ జేటు నగుఁ జావును బాటిలు నెల్లభంగులన్. 300

క. తనభూమిఁ బరులభూమిని । ధనము లుపార్జింప వలయు ధరణీశునకున్
ధనములు మూలము రాజ్యం । బునకును మూల మగుధర్మ మునకు నరేంద్రా 301

క. తనకొలఁది నుపాయంబులు । వొనరిచి ధనవంతుఁ డగుట భూపగుణము ని
ర్ధనుని నిజప్రజయును నై । కొనదు విరోధులును సరకు గొనరు కుమారా. 302

క. తెరువాటున మ్రుచ్చిమి ను । ర్ధురు లగుకౄరులకు మూఁక ద్రోహం బగు న
వ్వైరవరివారల బలంబున । ధరణీశుఁడు గూర్చుకొనుట సైన్యము దెచ్చున్. 303

క. అన్యాయంబునఁ బొసఁగిన । సైన్యముచే సమరజయము సమకూర దనూ
నన్యాయపరులు గాంతురు । మాన్యత్వము ధన్యు లైన మనుజాధీశా. 304

ఆ. మేలు సేసి తగినమిత్రునిఁ బడసి త । త్సుచరితముల నచ్చుసుఖము లనుభ
వింపఁ జూచు టుడిగి వేప్పడి యుండుట । యరయ నీతివిదుల తెరవు గాదు 305

చ. అతుల నమిత్రులం దెలియ నారయు టెంతయు సూక్ష్మకృత్యమ
వ్వైర వతిమ్లథం బరులు వీరస నుండియు మిత్రభావముం
బొరయుటయున్ సుహృజ్జనులపోలికి గద్దయు శత్రుతాగుణ
మ్మెరగ నొకప్డు సూపుటయుఁ జూతుము గాదె ధరిత్రి నెల్లెడన్. 306

క. బలవంతుఁ డైనశత్రుని । వలనఁ బ్రజాజనము గలఁగి నలను గలిపిఁ దాఁ
గలసియు వదిగడపవఁగాఁ । దొలఁగ వలయు నప్పి నేనిఁ దురిఁ గడొలయున్ 307

తే. నమ్మఁ దగనివారి నమ్మకయున్నది । తగినవారి నైనఁ దర్ద నమ్మి
యుండఁ దగదు తన్ను నొరులు నమ్మెడునట్లు । యుండి యొరుల నమ్మకునికి నీతి 308

క. వినుము తరి వేచి రిపు మూఁ । పున వోఁగ వలయు సముచితముం గనుగొని గ్రి
క్కునఁ గడవ శిలాస్థలి నైం । చినచాడ్పున నేర్పు మెఱయఁ జెఱుచుట యొప్పున్. 309

క. విని వినని వాఁడవోలెం గని కానని వాఁడవోలెఁ గానలయును విభుం
డౌనరింపఁ దలంచినపని కను వగునంతకు నభేద్యుఁడై జనులరయుడన్. 310

తే. బహుళమగు గర్వమునఁ గార్యభంగి యగును కార్యపరణియు నెఱుఁగక వాక్యవృత్తి
గాని తెరవున నడచినయేని గురుని నైన శాసింపఁగా దగు నందురి బుధులు 311

క. తెగఁ దీర్పక తెగ వార్పక తెగటార్పక కడమ కొంత దిక్కుఁగ నున్నన్
జగతీశ యప్పు నగ్నియుఁ బగయును మఱి పెరుఁగుఁ గీడు వాటిల్లుఁ దుదిన్ 312

ఆ. మార్దవమున మృదువు మర్దింపఁగా వచ్చు మార్దవమునఁ బరవిమర్దనంబుఁ
జెల్లు మార్దవమునఁ జెల్లనియది లేదు గాన మృదువు తలప ఖరము నువ్వె 314

క. తపము నిదానము ధర్మ ప్రపంచమున కెల్ల దానిఁ గ్రమమున వ్రతతం
త్పరాయణు లొనరింతు రధిప ఫలమూలాంబువృత్తిఁ దృప్తిఁ బొరయుచున్ 315

క. విను మశనని గ్రహము దమ మనునభిధానంబు గలమహాధర్మము త
ద్ధనవంతు విస్తరశగతిఁ జను నఖిలస్థావరములు జంగమతత్త్వులున్. 316

తే. పంచవిధవృత్తు లగుమహాపాతకములు లోనుగాఁ గిల్బిషము లెల్ల లుంఠితంబు
లగుఁ దపంబున సత్యశౌచాదు లొలయు నఖిలసిద్ధులు నఱచేత నావహిల్లు 317

క. సమతయు దమముఁ దితిక్షయు నమత్సరము హ్రీయు ధృతియు ననసూయార్య
త్వములు సహింసాదాన క్షమాత్యజనసూనృతములు సత్యము మూర్తుల్ 318

చ. కుదురు సమస్తధర్మములకున్ విను సత్యము యోగమోక్షస
త్పదములు సత్యకార్యములు పాప మసత్యము కంటె నొండు లే
దు పలుకఁ సర్వవేదములు తొమ్మిదినూఱులు రెండు నూఱు లై
యుదయిన యేదు గావు ధరలోత్తము సత్యముతోడ నారయన్ 319

క. భూతములు జరాయుజాదులో పేతంబులు గాన మోక్షమొదఁ గోరుట మే
లౌతత్వజ్ఞప్రియాసం జాతమనోమలిభభారసహుఁ డగుకంటెన్. 320

క. మనమున ధర్మము నర్థం బును కామముఁ గెలుకొనక పారవశ్యము లై
చన సుఖదుఃఖంబుల ముద మును దైన్యముఁ బొంద కునికి మోక్షకరమగున్ 321

ఉ. కూరుఁడు లోభియున్ శఠుఁడు కొండెయుఁడున్ జడుఁడుం గృతఘ్నుఁడున్
నేరని వాఁడు బొంకరియు నిందకు నోర్వనివాఁడు బందయున్
దీనత లేని దుర్జనుఁడు మత్సరవంతుఁడు నల్లువారలుం
జేయఁ ననర్హు భూపతికిఁ జెట్ట రొయునరుప్ప నకర్ష్వగోత్రమా. 322

క. మిత్రుం డైహికములు నా ముష్మికములు నైనభద్రములు దలఁకొలుపున్
మిత్రధనంబులలోనను మిత్రుఁడ యెక్కుఁడనుమాట మెత్తురు ప్రాజ్ఞుల్.

క. ఉత్తమకులజుఁడు సుగుణా ఢ్యుఁడు సుస్నేహమతియు నగుమిత్రునకుం
జిత్త మెలర్చు తెఱంగునఁ బొత్తున మన వలయు శుభముఁ బొంద వలసినన్ 324

క. కదియుం గాఢముఁ గాఢము నదిలో మఱి కొంతసేపునకు బాయును నె
మ్మది నట్లుగఁ దలఁపఁగ నల యిది పితృపుత్రాది బంధువర్గము సఖిపా 325

క. ఇది నాయది యనునూఁత స్మృది నెయ్యది పట్టుకొల్పినను వాసిత మై
తుది జేటు నొంది వానికి నది లోకము నాపహించు నత్యంతంబున్ 326

క. భీరుఁడు శూరుఁడు జడుఁడు వి శారదుఁ డబలాత్మకుండు సబలుం డన లే
దేరి నయిన మృత్యువు దు ర్వారం బై యపహరించు వైరికవర్యా 327

క. కామక్రోధాద్యము లగు నీమానసవికృతు లుడిపి యేకాంతస్పృహా
రాముఁడ వై నిను వెదకుట సూమే లొం డెల్ల నుడుగు సులభవివేకా 328

క. ఎన్నోట నైన నధముఁడు విన్నలవిడి నుండు లేదు వెఱపించుకయుం
బొచ్చెంపుఁజంద మొల్లఁడు మెచ్చరె సుగుణైనఁ బలుకు మృదువై యుండన్ 329

క. ధనతృష్ణము దుఃఖకరం బని కని తత్కాంక్ష విడుచునతనికి ధనితా
జనితాత్మాధీనత్వం బనుపమసౌఖ్యంబు సేయు నక్షీణముగన్ 330

క. మనమునకు సుఖముఁ గోరెదు జనులకు స్వర్గక్రియావిశాలపథంబుల్
పానుపున విడిచి భయము తే కునికియ యూహించిచూడ నుర వ్యాంగిన్ 331

తే. సామ్మ కోరినయంతన సుఖముగలుగ దని యొముపార్జింపఁగా సిద్ధి యగుట నిజమె
కలిగె నేని ననేకచింతల నొనర్చుఁ జెడుట చావుతోఁ దుల్య మయ్యెడుమ లేల? 332

క. శోకశ్రిమత్సృష్టులకున్ నీకలిమియు మూల మగుట నీ కగపడువాఁ
డేక స్త్ర్యము గానం డోకామమ నిన్ను దొలఁగి యుండెడ సుఖి వై 333

తే. ధనము చేటున విడిచి వాసనము నిన్ను నీడ విడిచెను గామము యేను శాంతి
దాంతిసత్యక్షమాభూతదయలఁ జెందినాఁడ లోభాదు లొందవు నన్ను నిఁక. 334

తే. కామ సుఖదివ్యసుఖములకాంక్ష దొఱఁగు మేలు షోడశాంశంబునఁ బోలలేవు
గాన కామము నిను శత్రుకరణిఁ జంపి బ్రహ్మపురమున నుండెద రాజువోలె 335

క. చనినఁ జను నున్న నుండును। మనుజుఁ డొకటి సేయఁ జేయు మనుజాధిప తో
డన తగిలి నీడవోలెను। విను చేసినకీడు మేలు విడువవు వానిన్ 336

క. కఱవుపయిఁ గఱవు వొరయుచు। వెఱపుపయిన్ వెఱపు దోఁప విడుచనియుఁడుమం
దొఱఁగమి పైఁ బురుషుఁ డిడుమ। దొఱఁగమిఁ జేప్పడుచు నడచు దుష్కర్మములన్

ఆ. ఉత్సాహంబుమీఁద నుత్సాహ మందును। సుఖముమీఁద సుఖము సొప్పడంగఁ
బుణ్యపదముమీఁదఁ బుణ్యపదంబున। కరుగు నరుఁడు సత్కృతి యైన నధిప 338

క. విను గుణములు మాయకు నొడ। లని యెఱిఁగి తమోరజస్సు లడఁచి సుసత్త్వం
బున నిలిచి సద్వివేకం। బున నదియుం దొలఁచి విమలబోధాత్ముఁ డగున్ 339

క. సత్యము తపమును యజ్ఞము। సత్యము వేదంబు దాంతి శాంతియు నగుటన్
సత్యము దొఱఁగుట నిష్కలి। నిత్యానుష్ఠానములును నిష్ఫలము లగున్ 340

క. విను మానసపరిసన్నతఁ। దను గనుపురుషుండు గలుషతం గానఁడు దే
ఱిననీట రూపు సూపఁగ। నను వై కలక నతి లేనియట్టులపోలెన్ 341

తే. ఇంద్రియంబులు దమయిచ్ఛ నిట్టు నట్టు। దిరుగ నేని దుఃఖంబులఁ దెచ్చు నవియు
కట్టువడి సుఖ మొసరింపఁ గాన నాత్మ। గావవలయు నింద్రియచోరగుణమువలన

క. జ్ఞానము కేవలకృప న। జ్ఞానికి నుపదేశవిధిఁ బ్రజనితము సేయం
గా నది సకలధరిత్రీ। దానంబునకంటె నధికతరఫలద మగున్ 343

తే. వెలుఁగు చుండెడిదీపంబు వేఱువస్తు। వులఁ బ్రకాశింపఁ జేయున ట్లలఘునిత్య
బోధనజ్యోతి యింద్రియములను మాన। సమును దనప్రభ విగతజాడ్యములఁ జేయు

క. విను పురుషున కింద్రియములు। మనంబు గలిగించుఁ గ్రియల మనుజేశునకుం
దనతన తెఱఁగునఁ గార్యము। లనేకములు సూపుసచివు లట్టుల వత్సా. 345

క. వల యురి యోదము గాలము। గలిగి కదా మృగముఁ బక్షి గజము ఝషము ద
క్షులు పట్టుదు రట్లె తజ్జ్ఞులు విజ్ఞానంబుకలిమిఁ జూతురు పురుషుల్. 346

క. పాము మెఱుఁగుఁ గాముకాళులు। ధీమంతుం డెఱుఁగ నేర్చు ధీసాక్షిత్వ
శ్రీమంతుఁ బరమపురుషుని। ధీమలనిర్మోచనంబు తెఱఁగు నెఱిఁగినన్. 347

ఆ. అడవి సొచ్చి యంతకంపకు నవ్వులకు। నతికుతూహలమున నరిగి యరిగి
చూచు చుండునట్లు చూచె సంసారకా। ననమునందుఁ దిరుగు జనులనడపు. 348

క. విను తెగ్గు లుడుపఁగ భేషజ। మునకుం దలకొనినచందమున మది సత్యం
బును శౌచము శమమును దమ। మును నెలకొలుపంగ వలయు మోహచ్యుతికిన్.

తే. స్మృతియుసంప్రీతియునుబ్రసన్నతయుమతియు।నీదృశములగుసత్త్వగుణోదితములు
రాగలోభరోషాదులు రాజసములు। దర్పశోకప్రముఖములుదామసములు. 350

క. జ్ఞానాజ్ఞానంబులకుం। దాన యుపాశ్రయము బుద్ధి తత్త్వాహంకా
రానూనలక్షణాద్యం। బైనదియొలుక దాని జీవుఁ డని చెప్పుఁ శ్రుతుల్. 351

క. జ్ఞానంబు దృష్టి నరునకు। గాన నయనహీను సదృకరణి యగుటఁ బ్ర
జ్ఞానవిహీనునినడవడి। దీని నెఱుఁగ వలయు నెఱుక దెచ్చికొనంగన్. 352

క. పరిహాసము భాషణమును। నిరీక్షణము లోనుగాఁగ నింద్యంబులు నుం
దరులతొడ దీని కే మని। చోరుఁ దగ దట్టైన మనసు సాత్త్వికు నుదతుల్. 353

క. విను మాంసాస్థిమయం బని। వనితాంగము సద్వివేకవైభవమునఁ గాం
చిన నందు మది దగుల దా। వనికిని నాడీవిశుద్ధి ప్రాప్తి యగుఁ బుత్రా. 354

క. జ్ఞానము యింధనముగ వి। జ్ఞానాగ్నిం బ్రబలఁ జేయ జరయు మరణముల్
నానావిధదుఃఖంబులు। లేనియమృత మక్షరంబు లెస్సఁ దోఁచున్. 355

క. కట్టినచీరయునుం దైఁ। బెట్టినచీరయును మారి బిగి యూరంగాఁ
జుట్టినచీరయుఁ బోలెను। బుట్టిన పొదివినవి దేహిని గుణత్రయముల్. 356

క. వాకును మనసును గాయము। నేకాయనవృత్తి శౌచ మెసలనిలపమున్
జేకొనునది యది బోధ। శ్రీకి ఘృతంబునకు వెన్న క్రియ జనక మగున్. 357

తే. బ్రహ్మచర్యమహింసనాఁ బరఁగుపరమ।ధర్మములు రెండు నువ్వియు త్తమతపంబు
దానిఁ గలవాఁడు నిర్మలజ్ఞానయోగ।సంతుఁ డై చూడ నేర్చు సర్వంబు ననఘ

క. ప్రియములు నప్రియములునై। దయమునఁ జిక్కువడఁ దిప్ప దత్తదనేక
క్రియలకుఁ బొచ్చెనరుఁడు మొయి।న్యాయముగు దెఱుఁగండు వెనుజ రాదివ్యథలన్ 359

క. ధనములు బంధులు భోగము। లనియెడునస్థిరము లెల్ల నాత్మ కెరవు సే
సిన శాంతి యలవడును మన। మున శాంతిశ్రీసమృద్ధి మోక్షము నిచ్చున్. 360

తే. నరుఁడు సుఖదుఃఖములవెంటఁ బోరయు వీక।మలఁచి యాత్మను జేర్చిన మానసంబు
లీన మగు నంద జలములలోన నిడిన। లవణకణముచందంబున నవనినాథ. 361

క. సముసృష్టిని తాయియుఁ గన। కముఁ జూచు మ సక్సమాధికలితం బగునా
త్రము వడపిన శబ్దబ్రహ్మము షణ్మాసముల యోగిమతి వర్తించున్. 362

క. అవిఘు దివసంబు రాత్రియు। ననునివి భానునకు లేనియట్టులు సతతం
బును పరమయోగయుతుఁ డగు। మునికి వివేకావివేకములు లే కుండున్. 363

క. ఒరు లేమేని నొనర్చిన। నరవర యప్రియము దనమనంబునకు గగుఁ దా
నొరులకు నవి సేయ కునికి। పరాయణము పరమధర్మపదముల కెల్లన్. 364

క. భూతదయయు ననహంకా। రాతిశయముఁ గలుగువిమలుఁ డప్రియశ్చ
త్రాతురుఁడు మూఁడు విధులు ను। నీతము లైనను దృఢాత్మనిష్ఠకతమునన్. 365

క. సంతోషామృతసుఖిత। స్వాంతుం డగు లేని వట్టివాఁడు గృహంబుం
గాంతారదేశమును నొ। క్కంత గ నిశ్చింతవృత్తి నక్షోభ్యుఁ డగున్. 366

క. యోగంబుఁ దపంబుఁ బరి। త్యాగంబును గాక యొందు లగునె హితంబుల్
రాగముసరిదుఃఖంబును। ద్యాగముఁ బోలెడిసుఖంబు నరయం గలవే. 367

క. విను కుసుమంబుల వాసిం। చిన నొప్పనికంపు విడిచి చెందును సౌర
భ్యనిరూఢిం దిల లట్టుల। యనఘా సత్కృతముల జీవుఁ డకలంకుఁ డగున్. 368

క. అంతంతకు సత్కర్మము। లెంతయుఁ బెను పొంద జీవుఁ డెక్కుడుచాయం
జింతాశలుడు ము వాయఁగ। సంతోషామృతము వాని సంశుద్ధుఁ డగున్. 369

తే. వాఙ్మనోదృష్టికలితపవిత్రనములఁ। గాయచేష్టితములను నన్యాయపథముఁ
బొరయ నీ కున్న సత్పథనిరతి గలుగు। సత్యశమదమాహింసలు సత్పథములు 370

తే. అనఘ మాధ్యాత్మచిత్తంబునందు విషయ। జాల మత్యంతగాఢసంసక్తి నొందు
లక్కరసము దండాదులఁ జిక్కఁ బట్టు।చందమున దీనిఁ గమట ప్రశాంతికరము

క. తనగృహమున నభ్యాసం। బున మెలఁగెడునట్టుచందమున సంసారం
బునఁ దిరుగుమూఢుఁ డెఱుఁగఁడు। వినుతం బగుమోక్షపథము విమలవివేకా. 372

క. వినుము మృణాళంబున నం। టినయొంపి జలంబులం గడిగినను జెడఁబా
సినక్రియ విమలజ్ఞానం। బున సంసారంబు వాయుఁ బురుష నరేంద్రా. 373

క. యోగనిరూఢుఁడు సంగ। త్యాగానంతరైకనిరతుఁ డతనికి జనసం
యోగము స్మృతిదైన్యంబును। భోగాభోగసుఖదుఃఖములు లే వధిపా. 374

ఆ. ప్రకృతి దొలఁగి తన్నుఁ బరికించుజీవుండు।పరముఁ గాంచు నపుడు ప్రకృతిసగుణ
తానిరూఢి యడఁగి తన్మయత్వము నొంది। జీవకేవలత్వసిద్ధి యొలయు. 375

క. విను కేవలుఁ డగుజీవుఁడు। దనుఁ బరముం గాఁగఁ జూచి తల్లీనత్వం
బున వెలుఁగునది నిరామయ। మనంత మగుపదము నూవె యతులవివేకా. 376

ఆ. జలముఁ గదిసి యుండి జలముచే నార్ద్రింబు। గాక యుండునట్టికమలదళము
భంగి నంతరాత్మ ప్రకృతిఁ బొందియును సు। ప్రకృతి బొందకుండు వీతదోష. 377

తే. ఇంద్రియంబులు మనమునం దివురఁజేసి। మనసు దిగిచి యహంకారమున నడంచి
బుద్ధిలోన నహంకృతిఁ బుచ్చి బుద్ధి। ప్రకృతిఁ గలఁపుఁ దధ్యాసతత్పరత గలుగు 378

తే. తాను దెగు లేని బాంధవదారపుత్ర। మిత్రు లసుసజ్జనంబు లేమిటికి విగత
చిత్తుఁడై గుహఁ జొచ్చి నిశ్చింతబుద్ధిఁ। దపవి కానంగ వలవదె తన్నుఁ దాన. 379

తే. జరయు మరణంబు మర్త్యునిజన్మ మాది। గాఁగ వెనువెంటఁ దగులునంగంబు వేచి
యెల్లి నే పెద నసక మే లిపుడ చేయు।(వినుము)గాచునె మృత్యువు జనుల పనులు

ఆ. ఆత్మకానగమును లంతియు చుట్టంబు। లగ్నిఁ గలపి మరలు నఖిల మైన
జ్ఞాతిజనము దీనిఁ జర్చింప కందఱు। యందు మమత వెనుచు నజ్ఞుఁ డనఘ. 381

తే. భోగములు సంపరిత్యక్తములుగఁ జేసి। కేవలాంగుఁడై నిర్మలభావయుక్తిఁ
దపము గృహమున నేనిఁ దత్పరత నాచ।రించి సంసారజలధిఁ దరించు నరుఁడు 382

ఆ. ఏన కలను నాకు నెవ్వరివానిఁ గా। నాత్మఁ దలఁతు నన్ను నట్టివాని
నెందుఁ గానఁ గాన నెవ్వరివాఁడను। గా ననంగ వలదె మానసీయ. 383

క. కోరికయు నొల్లమియు లే। కేపూపున ఘాతములకు నెగ్గు తెలఁగుం
జేరక యకామవృత్తిఁ ద। పోరతి నున్నతఁడు బ్రహ్మముం బ్రాపించున్ 384

క. వినఁ జూడం బడునందు। ల్లను సమతం బరముఁ గనుచు లౌల్యనిరసనం
బున సుఖదుఃఖాదిద్వం। ద్వనిరూఢుఁడు గాక యున్నతఁడు ముక్తిఁ గనున్ 385

క. ఇనుమును గనకము నిందయు। వినుతియు సమములుగఁ గనుచు వివిధాంగకముల్
దనలోన నడఁచుకమఠము। ననువున నింద్రియము లడఁచునతఁడు గను శివమున్ 386

ఆ. హింస లేక యునికి యింద్రియజయము నై। రాశ్య మచపలత్వ మనుగుణములు
నాల్గుఁ గలుగునట్టినరునకుఁ గరతలా। మలక మంత రాత్మమహిమ యెల్ల. 387

చ. అరయఁగ ధర్మతంత్రములయందు నిరర్థము లే కొకండు నె
వ్వరిమది నొంచు వ్రాలెఁ దగ వారలు దానిన పూని యాచరిం
తు రదియ వారి కిష్టఫలదోహనకార్య మొనర్చు నెల్లెడం
బురుషులఁ జూడమే తమకుఁ బోలినధర్మములన్ నెఱుంగఁగన్. 388

క. న్యాయమున సంగరంబుం। జేయఁగ శస్త్రాగ్ని నున్నఁ జెందిన దానం
గాయంబు విడుచుపురుషుఁడు। వే యేటికి మోక్షలక్ష్మివిభుఁ డగు నధిపా. 389

క. తనతోఁ దుల్యుం డైనను। మనుజాధిప యధికబలసమగ్రిస్వాము గ
ల్గిన నని శత్రుని వధియిం। చిన నరపతి పుణ్యలోకసిద్ధిం బొందున్. 390

క. పరమర్మభేదంబులు నయ। విరహితములు ధర్మకార్యవిముఖంబులు ని
ష్ఠురములు నగుమాటలు స। త్పురుషుం డాడఁ డవి సత్యములు గా కునికిన్. 391

క. అతిథిజనులు తమతమవాం। ఛితము లనుభవించునట్లు సేయం గనిశం
గృహకృత్యతఁ బొందరె గృహ। పతియును గృహిణియును ధర్మభారమువలనన్. 392

చ. వినుము జరానుబంధమున వెండ్రుక తెండముఁ బండ్లు వీనులుం
గనుఁగనయుంన్ జరం బొరయుఁ గాని యొకప్పుడుఁ దృష్ణ జీర్ణ గా
దనయముఁ జేర్చి ప్రాణముల వన్పక పో దది రోగ మల్పబు
ద్ధి నరులు వోర్చి లే రది మహం జొరనీరు సుఖార్తు లై బుధుల్. 393

క. పురుషాదిక యై తోఁచుచు। నిరూపణము సేయ నూఁది నిర్దేశింపన్
వెంవు వహిక శాశ్వతసుఖ। భరితత నిర్వాణ మనఁగఁబడుఁ బ్రకృతి నృపా. 394

తే. సత్కులంబునఁ బుట్టుట సకలవేద। ములు బురాణంబులును శాస్త్రములునుజ దువు
టయును సద్గతిఁ జేయఁ బ్రోషములు గావు। శీలసామగ్రి లేనిదుశ్చేష్టితునకు. 395

తే. రూపగుణశీలముల ననురూపుఁ డైన। వరున కిక కన్యకఁ దననలసినట్లు
తగనివానికి నిచ్చుట ధర్మదేవ। తాతనూభవ బ్రహ్మహత్యాసమంబు. 396

క. పాతివ్రత్యము గలిగిన। నాతి యనఁగ డైం మన జనస్తుత వేశే
యాతతధర్మార్థసుఖ। ఖ్యాతులు సద్భాగ్యవిలనఁ గాదే కలుగన్. 397

క. కులమును శీలము విద్యయుఁ। గలవానిం బిలిచి ప్రీతిఁ గన్నియ నీఁ గా
వలయును నుదకపూర్వదానా। కలితంబుగ బ్రహ్మకర్మగతి యిది యధిపా. 398

ఆ. పాత్రి మందురి బుధులు గన్య పురుషుఁ గోర। నతఁడుఁ గన్యవిూఁడ నాస సేయ
నచల మగుపరస్పరానురాగము గని। ప్రేమఁద మొసఁగఁ జేయుపరిణయంబు. 399

క. కన్యా మూల్యంబును గనిసినఁ। గన్నియ నెవ్వానిఁ గోరు గాంధర్వం బా
యన్య నతని కిచ్చుట వెల। యన్నట యాసురము సూనృపాలమఖ్యా. 400

క. బలిమి మెఱయు నపుఁడు గన్నెకుఁ। గలవారిం బొడిచి కరము క్రౌర్యంబున న
ప్పొలతుక దుఃఖింపఁగ వా। రలు వోసలఁగఁ దెచ్చికొనుట రాక్షసము నృపా. 401

ఆ. అయిదు తెఱఁగులందు నారయ మూఁడుశ్రే। ష్ఠములు ధర్మకృతులు ధర్మప్రతీ
యాసురంబు రాక్షసాహ్వయంబును ధర్మ। మారసంవిధానమాపితములు. 402

తే. మాతృపితృహీన యైనను భ్రాతృరహిత। భామ ముదిసిన నబ్బాల పరిణయార్థ
వరణమున కర్హ గా వని పరమమునులు। గర్హ చెప్పుదురు పరిణయకల్పవిదులు. 403

క. నిజదారపరులు సంతత। యజనరతులుఁ గామరోషహంతలు నగుస
ద్విజుల నరసి ధన మిచ్చుట। త్రిజగత్పూజ్య మగు నండ్రు ధీరవిచారా. 404

క. దారిద్ర్యముచేఁ గుందుచు। నేరిని నడుగంగఁ బోవ కెంతయుఁ గృశతం
గూరినవిప్రున కుర్వ్యగ। వారనిపయ నీగిఫలము వాగ్గోచరమే. 405

ఆ. అన్నదానసదృశ మగుదాన మెందు నె। న్నడును లేదు గావునను విధేయ
మన్నదాన మధికయత్నపూర్తంబుగాఁ। బూని దానిచేఁత పుణ్యతమము. 406

క. పరమజ్ఞానులకొద్దను। బరఁగిన సజ్జనుఁడును బోధభరితుఁ డగు నిరం
తరమేరుసమీపస్థితి। హిరణ్యరుచిఁ గాక మెసక మెసఁగినపగిదిన్. 407

తే. ఇన్నియాచారములలోన నెక్కుడండ్రు। సకలభూతములందును సదయుఁ డగుట
యాదిమును లట్లుగావున నఖిలవర్ణ। ములకు దయకెమ్మె ద్దయుఁ గలయుఁ గుణము. 408

క. విను దానంబులఁ బాపము। లనఘా చెడు దానములకు నన్నిటికిని స
జ్జనసేవ్య యన్నదానము। మను లధికం బండ్రు పాపములఁ బాపునెడన్. 409

తే. దినము పథ్యంబు గా కుండఁ దవిరి యన్న। పానదానంబు లాదవినభంగిఁ జేసి
మతిభుజింపఁటఁబోలెడుమహితధర్మ। కార్యమొండొకఁడెందునుగలదెయరయ 410

తే. మనసునను వాక్కునను గాయమునను హింస। నడపుమాంసంబుదినుటతో నాలుగిరెఁ
డెఱుఁగులవిను ద్విహింసవర్తింపఁజేయుఁ। గానకడుఁగడుమాంసభక్షణముదలఁప. 411

తే. వాజిమేధంబుకంటెను బూజనీయ। కర్మ మందురు మాంసభక్షణమువిడుపు
వినుము చంపుటయును జంపఁ బనుచుటయును। గల్మషంబుల కెల్ల నగ్గలము లధిప.

ఉ. మ్రానును బాతనుం గలదె మాంసము ప్రాణులమేనఁ గాక య
మ్మేనుల నొంచ నెప్పు డమమేములు సోఁకినమాత్రనె ట్లగున్
దానిఁ దలంపఁగా గలదె తా నదిమానిన హింస లన్నియున్
మానవె యుంచు నుత్తముఁడు మాంపకు మాను దయార్ద్రచిత్తుఁడై. 413

క. దానము ధర్మము దప మి। జ్యానిష్ఠ యనంగఁ గల్గుసత్క్రియ లెల్లన్
మానవనాథ యహింసా। నూనాకృతు లండ్రు శ్రుతుల నూనినపెద్దల్. 414

ఆ. అన్యమాంసమున నిజాంగమాంసంబుఁ బో। షింతు ననుటకంటెఁ జెట్ట లేదు
మాంసభక్షణంబు మానుటకంటెను। మేలు లేదు కర్మజాలకమున. 415

క. భూతముల కలుగునతనికి। భూతము లఖిలములు నలుగు భూతహితార్థీ
భూతముల కభయ మిచ్చిన। భూతాత్ముఁ కభయ మిచ్చు భూతావళియున్. 416

ఆ. దానమును దపంబు ధర్మంబు యజ్ఞంబు। శౌచమంత్రతంత్రసత్యములును
బుధు లహింసరూపములు గాఁగఁ జెప్పుట। నెల్లకర్మ మను వ్యహింసకలిమి. 417

తే. శస్త్రజీవికయును వరిష్టభాగ। మాహరించుటయును భృత్యు నరయుటయును
బ్రజవివాదంబు విను నోటఁ బత్తుపాలి। గామియును రాజులకుఁ గృత్యకర్మకోటి. 418

తే. క్షుత్పిపాసలచేఁ గడుఁ గుందినట్టి। యతిథి వచ్చినఁ బ్రియమున నతని డప్పి
వోవు నట్లుగ సముచితభోజనంబు। నెట్టు టిల్లపుణ్యములకెఁ బెద్ద దలఁప. 419

క. పరబలము పై నడరి నెఱ। తురగ వజ్రులు వాఁడి జంపు గుఱు దురమున న
ప్పురుషుఁ డినంబును బుచ్చౌ। త్తర మని వేదములు సెప్పఁ దనుతిగ మఘ్యా. 420

క. పోగులయందలి మగఁటము। మారణముం బుణ్యలోకమహితమహిమకుం
గారణ మెఱుఁగు మహింసా। కారం బొట్టి దని నీవ కార్యవిచారా. 421

క. వంచనయును జాడ్యంబును। నించుకయును లేక ప్రభువునిష్ట మెఱిఁగి తాఁ
బంచినపని నెరవునఁ గా। వించినకర్మకరుఁ డొందు విపులధనంబుల్. 422

క. జీవుఁడు జీర్ణశరీరముఁ। బో విడిచి నవంబుఁ బొందఁ బుట్టను పేరం
దా వెలయం దద్దశ జీ। వావలి వర్తించు నిటు గతాగతపదవిన్. 423

తే. క్షమయు సత్యంబుఁ గృపయు శౌచమును గురుల
వలనిభక్తియు నాయువు పొలుపు నిచ్చు
నలుక బొంకు క్రూరత శుచితాపగమము
గురువిరోధ మాయువుఁ గడుఁ గుఱింగఁ జేయు. 424

తే. శ్రుతము నరునిఁ బరజ్ఞానయుతునిఁ జేయు। దానిసత్కృతి మల్పమును ననూనఫలము
నిచ్చు నజ్ఞానసత్కర్మ మెంత దైన। నఫల మగుఁ గాన శ్రుతవంతుఁ డగుట వలయు.

ఉ. శౌచము బ్రహ్మచర్యమును శాంతియు లఘ్వశనంబు నై మదిం
జూచు నంతరాత్మ నెడ సొచ్చినదీక్షవిశేషముల్ ధృతిం
ద్రోహము భక్తియుక్తి గురుండు ప్రమోదమయుండు గాఁగఁ ద
ద్గోచరతం జరింపఁగ వకుంఠితమోక్షసుఖంబు సొప్పడున్. 426

క. కిన్ను దేహియు దేహము నే। ననునిశ్చయదృష్టి గల్గువాఁతఁడు సాలున్
మనసు మగిడించు నది ని। గ్రహసంస్కృతిఁ బొనర్చి మోక్షమార్గముఁ జూపున్ 427

తే. నాగు లింద్రియవిభ్రాంతి సంహరింతు। రఘము దెలిసి ప్రాయశ్చిత్త మాచరింతు
రవిరళంబుగా ధర్మ మాచరింతు। రఖిలభూతదయాళుత్వ మూఁదఁ గలరు. 428

క. తత్త్వ మనశ్వర మశరీ। రత్వంబునఁ బరఁగు భూతరాశి నియతనా
శిత్వంబు హింసకర్వము। దాత్త్వికమై లేదు దేహదళనమున నృపా. 429

క. శరధిపరివేష్టితక్షితిఁ। బరిపాలించినను దానిపై దృఢమమతం
బొరయక వర్తించిన న। ప్పురుషుని దురితంబు లెట్లు వొందఁగ నేర్చున్. 430

క. వనమున వన్యాహారం। బున వర్తించినఁ బదార్థములపై మమతన్
మనమున విడకుండిన న। మ్మనుజుఁడు మృత్యుముఖవర్తి మనుజాధీశా. 431

క. వెలిపగఱ గెలుపు గెలుపే। యలఘుమతిన్ గెలువ వలయు నభ్యంతరవై
రులఁ దద్విజయము మోక్షము। నలవఱుపం జాలు నొంట నమ్మె లగునే. 432

క. విను మంత్రిశ్రేష్ఠులలో। ఘనుఁ డగుఁ గాముఁడు నిరస్తకామం బగువ
ర్తనము విశద మధ్యయనయు। జనదానంబులును గామసహితములు గదా. 433

తే. సర్వసంకల్పవర్జనశాలి యగుచుఁ। బరమశాంతి చిత్తంబునఁ బట్టుకొల్పి
నరుఁ డనింధనానలమున ట్లల్లఁ బొందు। వికృతివర్జిత యైననిర్వృతి కృతాత్మ. 434

క. తనువువలన నిష్క్రమణం। బొనర్చి జీవాత్మఁ గాంచుయోగివరుం డ
య్యును వోదవి యట్లు దన్నుం। గనినప్పుడు జననమరణగతులం దొలఁగున్. 435

క. ముక్తుండు జరామరణవి। యుక్తుండై హర్షశోకయోగ మెడలి స
ద్భక్తులకును సత్పద మిం। శక్తుం డగుఁ జావ్వె బ్రహ్మచర్యము పేర్మిన్. 436

ఆ. ఒడలియస్థిరత్వ మూహించి యాశ్రయం। దధికనిష్ఠ గలుగునతఁడు సకల
భూతకోటివలనఁ బొందఁడు భయము రా। గాదిదుఃఖములకు నగపడండు. 437

క. విను యోగయుక్తునకు శ। స్త్రనిహతి జలబాధ యగ్నిదాహము మొదలై
చనునట్టి వికారములు లే। వనఘ యతఁడు గోరఁ డైంద్రి మపపద మైనన్. 438

క. తనయందు దన్ను దెల్లసిఁ। గనుటం గడచినసుఖంబు గలుగదు లోకం
బున నెందు దాని కధ్యా। త్మనుతానుష్ఠానమునకు వినుమి పలయున్. 439

క. తనరెడు తేఁగినతెరవున నా। మ్మన మంతర్వర్తిఁ జేసి మఱి బాహ్యగతిం
జననీకుండఁగ నది యెం। దను వునఁ బడు నిలుప వలయు నచ్చట దానిన్. 440

తే. అత్యావాదితత్త్వము చక్షురాదికంబు। లైనయింద్రియములకు గ్రాహ్యంబుగాదు
సకలమలవిరాసాద్యప్రసన్నశరమ। నఃప్రదీపంబు దర్శనం బొనర్చు. 441

క. కలయంగ నెల్లయెడలం। దలలును లోచనములును బదంబులు హస్తం
బులు నైయాత్మత్వం బు। జ్జ్వలభంగి వెలుంగ యోగశాంతుఁడు గాంచున్. 442

ఆ. శ్రద్ధ గలిగి లోకసంగ్రహసంగంబు। నీవ విడిచి యొవ్వఁ డీయుపాయ
ముల భజించు వాఁడు మోక్షలక్ష్మికిఁ బతి। యగు నొకింత సందియంబు వలదు 443

తే. సత్యమునన భూతంబులు సంభవించు। నంద వర్తించు దానన యడఁగు నిది గు
ణత్రయాత్మకసత్యచరిత్ర మమల। బుద్ధులార సత్యంబుప్రసిద్ధి గనుఁడు. 444

చ. బలమును శౌర్యమున్ ముదముఁ బ్రాభవమున్ సుఖదుఃఖభాగితా
కలనముఁ జెల్మి సేఁతయును గాంక్షయు నొల్లమియుం బ్రతాపముం
గలహము నీర్ష్యయున్ బహువికల్పప్రభాషలుఁ గామినీజనం
బులయెడ గాఢరాగతయు బొంకును నుబ్బు రజఃప్రభూతముల్. 445

క. రాజసగుణములకుం గల। నైజ మెఱుఁగువారు తజ్జనకవైకృతముల్
దీజితములు గావింపఁగ। నోజ గలిగి శుభదవృత్తి నొందుదు రెందున్. 446

క ధర్మార్థకామగోచర। కర్మములకు సాత్త్వికాదికప్రకరవిశా
రోర్ములు హేతువు లగు ని। వ్యాగ్మతకే తదనుభూతి గారణము సుఁడీ. 447

క. సత్త్వము ప్రదీప మావర। తత్త్వముఁ గాంచుటకుఁ గాన తత్సాధనతా
తత్త్వము వదలక చిత్తను। శుత్త్వకలిత మగుచెలవు గఁదురు కృతాత్ముల్. 448

క. శరనిధితరఁగలభంగిం। బొరిఁ బొరి నవ్యక్తమునన పుట్టు నడంగున్
సురనరధరణీరుహముఖ। చరాచరానేకభూతజాలము లెల్లన్. 449

క. తమము రజస్సుఁ దొలఁగి స। త్త్వమునన రమియించి యాగుణత్త్వముఁ గని స
త్త్వమును దిగనిడుచు వైరా। గ్యమహితుఁ డగు మునివరుం డకల్మషులారా. 450

క. పరమం బనంగ వేదాం। తగహస్యాత్మకత వెలుఁగుతత్త్వంబు నిజం
బరయఁగ క్షేత్రజ్ఞుఁడ యను। పరిణతి గలయతఁడు సర్వపదవిదుఁడు సుఁడీ. 451

క. వృత్తివిశేషమునఁ జనిన। చిత్తము వెనుకఁ జని యందుఁ జేర్చి మనసు దా
నెత్తెఱఁగునకుం దివియమి। యుత్తమపురహస్య మండ్రు యోగమున మునుల్ 452

క. వినుఁ డవ్యక్తాంతం బగు। పని దెల్ల నవిద్య నొలయ బంధము మమతం
బనుపడిన మృత్యు వమృతం। బనఁ జను నది నిర్మమత్వ మారఁ గలిగినన్. 453

క. కోరికలకుఁ జోరక యసం। గారూఢత గలిగి యెల్లయందును సమతం
గూరినచిత్తంబులు గల। సారాత్మకు లీపథమునఁ జనుటకు శక్తుల్. 454

క. పురరక్షణము గృహంబుగ। నగరర చేయంగ వలయు నమ్మఁ గలుగుస
త్పురుషుల నిడఁ దగుఁ గుడుపు ని। దుర మొదలగు లోపములతో డరువు లరయన్

క. విను మంత్రభేదమున న। చ్చినకీడున కనఘ శాంతి సేయు టరిది కా
వున మంత్రులతో మంత్ర। వనవిషయమం బూఁది చెప్ప వలయుం జామ్రా. 456

క. అమృతమయము బుగ్యజుస్సా। మములయుపనిషద్వచస్సమాజములకు సా
చ్యమగునపురుషోత్తము ని। శ్చయముగా నగువాని భక్తిగమ్యుఁ దలంతున్. 469

క. నుమ్యక్తక్షేత్రంబున। నవ్యక్తాకృతివిరూఢి నాసీనుండై
భవ్యత నొందు క్షేత్రా। త్మవ్యపదిష్టుఁ బ్రణుతింతు దామోదరునిన్. 470

క. ప్రకృతివికృతులను షోడశ। వికారముల వేరవి ప్రకృతివికృతిత్వముఁ బొం
దక యుండఁ గాంతు రెవ్వని। సకలమునులుఁ దలఁతు నట్టిసాంఖ్యాత్మహరిన్. 471

క. అంతశ్చరవహిరతములు। శాంతములుగఁ జేసి యనలసత్త్వము శమమున్
దాంతియుఁ గలజనములు గను। నంతర్హితుఁ గొలుతుజలశయను యోగాత్మున్. 472

తే. చరణనాభిశీర్షంబులు ధరయు నంత। రిక్షమును దివమును జగచ్చక్షురగ్ని
దిశలు దృఙ్ముఖశ్రోత్రముల్ దీప్తి లెవ్వ। హాత్మ్రకు నట్టిహరిని లోకాత్ముఁ దలతు

క. మాసర్త్వయనాబ్దమయో। ద్భాసితరూపుఁ డయి సృష్టిఁ బ్రళయంబుఁ దగం
జేసి పాలుపాటుకారి ను। పాసింతును యోగిభోగ్యబలుఁ గాలాత్మున్. 474

క. సర్వమునందును దానగు। సర్వముఁ దనయందు నుండు సంచారంబుల్
సర్వమునకుఁ దనవలనన। సర్వాత్మకు నట్టివృష్ణిసత్తముఁ దలఁతున్. 475

ఆ. క్షరము లైనభూతసంఘంబులం దెల్ల। నక్షరస్వరూపుఁ డై వెలుంగు
సకలబుద్ధివృత్తిసాక్షి సాక్ష్యాత్మ న। స్పందబోధఘను ముకుందుఁ దలఁతు. 476

క. క్షేత్రజ్ఞుం డనఁగ నిఖిల। గాత్రవ్యాప్తత్వమహిమ గలిగి సమీరా
మాత్రమున జీవుండును। గోత్రము నై సర్వవర్తకుం డగుచుండున్. 477

క. విను మాత్ముఁడు క్షేత్రజ్ఞుం। డన భూతాత్ముఁ డనఁ బురుషుఁ డనఁ బరమేశుం
డన బుద్ధిసాక్షి యనఁగా। జననరహితుఁ డనఁగఁ బరఁగు శాంతిప్రవణా. 478

ఆ. మణిమయములు గనకమయములు రజతమ। యములుమఱియు మృణ్మయాదికములు
నైన పెక్కు పూసలందుఁ దారి యున్నట్లు। భూతకోటియందుఁ బురుషుఁ డుండు.

క. అమృతం బచ్యుత మమలం। బమేయ మవ్యయ మనంత మవ్వేలుఁగు యమా
ద్యముల నలవడినచిత్తము। శమాతిరేకమునఁ బొంద సంవేద్య మగున్. 480

తే. అచలు మాత్మ్ర శరణ్యు సహస్రశీర్షు। నభయకారి నశీర్షు నారాయణుని స
నాతనుని యోగమూర్తి లోకాతిరిక్తు। ధ్రువుని నీశ్వరు హరి భక్తితోడఁ గొలుతు.

క. కాలముఁ బర్జన్యుండును। నేలయు సస్యంబుఁ గ్రియయు నిష్క్రియయును ధ
ర్మాలోకము నై మహిమ। న్లీల నలరుదేవదేవుని బ్రణుతింతున్. 482

క. అనలునకు రవికిని శశాం। కునకును గ్రహతారకములకును దేజం బే
స్వానివలన నావహిల్లెడు। ననుపాధిక తేజుఁ గొల్తు నవ్విశ్వాత్ముక్. 483

క. అగమను నబోధ్యుని నఖిల। జగద్భరణుఁ బరు నమూర్తిసాగరునిఁ బ్రబో
ధగరిష్ఠుఁ బంచకాల। జ్ఞు గుణాత్మకు నిర్గుణత్వశోభితుఁ గొలుతుక్. 484

క. న్యక్తమునకుఁ బ్రథనం బ। న్యక్తం బాతత్వమునకు నవుల ననుపచో
యుక్తికిఁ బరాయం బగు। భక్తపరాధీను భవ్యభావ్యు నుతింతుక్. 485

క. జ్ఞానధ్యానపరాయణు। లైనమహాత్ములు జితేంద్రియత్వమహిమ లె
వ్వానిం బొందిన మగలరు। వాని శరణుఁ జొచ్చి బ్రతుకువాఁడ సుకృతి నై. 486

క. ఇనునడుమ నెలుంగుచు సో। మునిమధ్యమునం జలత్వముం బొందనిని
ల్పున వెలయుదీప్తి యగువా। ని నిరంజను నంతరాత్మునిం బ్రార్థింతుక్. 487

క. సోమార్కమయంబును దా। రామయమును నిత్యసుస్థిరంబును నగు తే
జోమయతత్త్వము నాత్మా। రామత్వంబున నిరంతరంబును జూతుక్. 488

క. కోపముఁ గామము రాగ। ద్వేషములును లేక భక్తి దిర మై యేకా
శ్లేషునిఁ గాఁ గొలుతు రవి। శ్లేషమనోనిలయున్నతి సిద్ధులు నిన్నుక్. 489

క. ఫలములు గోరక కర్మం। బులు సడపుదు వాని విమలబోధాగ్ని వడిం
బొలియించుచు నిర్ద్వంద్వత। నెలకొను నేకాంతజనులు నినుఁ గందురు హరీ. 490

క. ఏకత్వం బమలత్వ ము। నేకత్వము గలుగునీమహిమచందం బా
లోకింప నిపుణు లగును। శ్లోకులకుం బరమపదము సులభము గాదే. 492

సీ. ఇల జలంబులజలంబులు శిఖి శిఖి వాయువున వాయు వంబరంబునను నంబ
రంబు చిత్తమునఁ జిత్తం బహంకృతి బుద్ధిఁ దగ నొసఁగించి యింత
వట్టును గూడ నవ్యక్తంబుఁ జేర్చి యవ్యక్తంబు నిజథంగి నైనతిగుణ
సామ్యావ్యవస్థితి సడిసన్న కారణభూతతన్మాత్రలు పొదున కుండఁ

గీ. దొలఁగఁబెట్టుట దొరకొన వలయు దానఁ। బరమమును గేవలము నగుపదముగలిగి
యేన నీ వను నైక్యంపు టెఱుక వొడముఁ। గాత గమనాగమనములు గ్రాఁగిపోవ. 492

క. పరమాత్ముని నారాయణుఁ। జిరంతనుని భక్తశేముషీనిష్ఠాస్వీ
కరనైకాయనుని నమ। స్కరణంబునఁ దలఁతు నతులషడ్విధభూతిక్. 493

తే. పునరావృత్తిరహితుం। డనఘా పరమాత్ముః జెందినట్టి పురుషుఁ డ
ట్టినతావస్థను మోక్షం। బని చెప్పుదు రంతకంటె నధికము గలదే. 494

16 పద్మాబాయి — వీరరసప్రధానమైన నవల. రాజకుమారునిఁ గాపాడుటకు నిజకుమారుని శాత్రవునికత్తికి బలిచేసిన యొక రాజపుత్రసాధ్వీమణి చరిత్రము. ఇందలి రాజనీతి, సూత్రధారుల నేతుగోపాయములును చదువ తీరవలెను.

సత్యవోలు అప్పారావు గారిచే రచింపఁబడినది. 0—8—0

17 హేలావతి — చరిత్రాత్మకమైన నవల. ఒకమాంస్త్రీ, హుమాయూను చక్రవర్తియొక్క మంత్రికుమారుని వరించి పెండ్లియాడినకథ.

తెల్లాప్రగడ సూర్యనారాయణరావు గారిచే రచింపఁబడినది. 0—4—0

18 ప్రభావతి — ప్రభావతీప్రద్యుమ్నమునకు సరియగు వచనము. పింగళి సూరనార్యుఁడే దీనిని వచనమున వ్రాసినట్లుండును.

సూరాబత్తుల సూర్యనారాయణ గారిచే రచింపఁబడినది. 0—4—0

19 మీరాబాయి — భక్తిరసప్రధానమైన పద్యకావ్యము. పతిచే నిందమోపఁబడి ప్రాణముల త్యజించిన శ్రీకృష్ణభక్తురాలిచరిత్రము. ఇందలి పద్యములు ముక్కుతిమ్మనార్యుని పద్యములవలె ముద్దులొలుకుచుండును.

రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ గారిచే రచింపఁబడినది. 0—4—0

20 కురుపాండవదాయభాగవిమర్శనము — ఇయ్యది శ్రీకాశీభట్ల బ్రహ్మయ్య గారి 'కురుపాండవదాయభాగనిర్ణయము' పై వ్రాసిన విమర్శనము.

కవిరాజు శ్రీపాదకృష్ణమూర్తి శాస్త్రిగారిచే రచింపఁబడినది. 0—1—6

21 బ్రహ్మమతము — ఇందు దేవుఁడు, మానవుఁడు, ప్రకృతి, ఉపాసన, పాపము—మోక్షము, అవతారములు—మహాత్ములు, ప్రమాణగ్రంథము—ఈశ్వరప్రత్యాదేశము, సాంఘికాచారము మున్నగు విషయములు యుక్తియుక్తముగఁ జర్చింపఁబడెను.

హాలహర్తి నరసింహము గారిచే రచింపఁబడినది. 0—6—0

22 ఆర్యసూక్తిముక్తావళి (ప్రథమభాగము) — ఇందు భారతమునందలి నీతులు, రాజధర్మములు ఏర్చి కూర్చఁబడినవి.

సత్యవోలు అప్పారావు గారిచే రచింపఁబడినది. 0—4—0

23 కర్ణభారము — ఇయ్యది కాళిదాసునకుఁ బ్రాచీనుఁడగు భాసమహాకవిచే రచింపఁబడిన నాటకమునకుఁ దెనుఁగు.

వానపల్లి రామకృష్ణకవి ఎమ్. ఏ. గారిచే అనువదింపఁబడినది. 0—2—0

